# స్త్రీవాద ధోరణులు :
# సమకాలీన సాహిత్యం

యువ భారతి రజతోత్సవ
సదస్సు పత్రాలు

**యువ భారతి**
సాహితీ సాంస్కృతిక సంస్థ
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.

# STRIVADA DHORANULU : SAMAKALEENA SAHITHYAM

An anthology of literary essays - Published by YUVA BHARATHI, lterary and cultural organisation, Tilak Road, Hyderabad - 500001.



యువభారతి రజతోత్సవ సదస్సు పత్రాల ప్రచురణ

ప్రచురణ సంఖ్య : 147

ప్రథమ ముద్రణ : మార్చి, 1994

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

**వెల : రూ. 25-00**

ప్రతులకు :

**యువ భారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001

ముద్రణ :

**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600457

ముఖచిత్ర ముద్రణ :

**విప్లా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్,**
శంకరమఠం దగ్గర, నల్లకుంట,
హైదరాబాదు - 500 044.
ఫోన్ : 666242.

# మూడు పదుల యువభారతి

## మూడు ఆశయాలు :

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించ గల సహృదయ లోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలం వారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణలద్వారా, కార్యక్రమాల ద్వారా యువభారతి యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది!

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్నీ, ప్రజాస్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి!

## సాహితీసంస్థగా ముందడుగు :

రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంతో యువభారతి ముప్పైయేళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. సమాజంలో ఉత్తమ సాహిత్యం పుట్టటం ఒక వంతు; దానిని ప్రజల మధ్యకు తీసుకొనిపోయే ప్రయత్నం మరొక వంతు. పొలం దున్నే రైతులు, రాట్నం తిప్పే పల్లెటూరి పడతులు, మధ్యతరగతి ప్రజలు, యువతీ యువకులు, విద్యార్థినీ విద్యార్థులు, ఫ్యాక్టరీ కూలీలు, ఉద్యోగులు, ఉద్యోగినులు - ఇలా చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన-

అంటే వారి మాతృభాషలో వెలువడిన - సాహిత్యం చదవాలి. లేదా, కనీసం ఆ సాహిత్యం గురించి పరిచయం చేసుకోవాలి. అప్పుడే తెలుగుసాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒక జాతిలో రచయిత(త్రు)లు పుట్టటం ఎంత గొప్పో, సహృదయులు అధికశాతంలో అభివృద్ధి చెందటం కూడా అంతే గొప్ప. సాహిత్యంలోని ఉత్తమ విలువలను గుర్తించి, గౌరవించే సహృదయ లోకాన్నీ సాహితీ వాతావరణాన్నీ సమాజంలో నిర్మించటంలో సాహితీ సాంస్కృతిక సంస్థల పాత్ర విశేషంగా ఉంది. ఆ బాధ్యతను గుర్తించి యువభారతి ఇన్నాళ్ళుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. ప్రజల హృదయాలలో తన ముద్రను పదిలంగా వేసుకున్నది.

## యువభారతి జీవితం ఒక సాహిత్యోద్యమం :

యువభారతి 1963 సం॥ విజయదశమినాడు పుట్టింది. మొదటి రెండేళ్లూ రూపుదిద్దుకున్నది. ప్రతి నెలా మొదటి, మూడవ ఆదివారాలలో సమావేశమై యువభారతీయులు మూడుగంటలసేపు మానవ సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడే కార్యక్రమాలను నిర్వహించుకునేవారు. వక్తృత్వాన్నీ, రచనా పాటవాన్నీ, ఆలోచనాశక్తినీ, అధ్యయన శీలాన్నీ, ఝడితిస్ఫూర్తినీ అలవరచే క్లుప్త గోష్ఠి, పుస్తకచర్చ, కవితాపఠనం, సమాలోచనం మొదలైన అంశాలను చైతన్యవంతంగా నిర్వహించుకునేవారు. అప్పటి సమావేశాలన్నీ సాహితీ శిక్షణ శిబిరాలుగా ఉండేవి. 1965 విజయదశమి నాటికి యువభారతి ఒక సమగ్ర రూపం తాల్చింది.

1965-70 సంవత్సరాల మధ్య యువభారతి తన ఆశయాలకు అనుగుణంగా సాహిత్య కార్యక్రమాలను చేపట్టి ప్రజల మధ్యకు నడిచింది. బలమైన ప్రయోగాలను చిత్తశుద్ధితో చేసి ప్రజల మన్ననలను పొందటం ప్రారంభించింది. మహిళా విభాగ కార్యక్రమాల ప్రారంభం, సైక్లోస్టైల్డు పత్రిక వెలువరించటం (దాదాపు వెయ్యి ప్రతులు చెల్లేవి) ముఖ్యమైన అంశాలు. యువభారతి ప్రచురణలు, సదస్సులు ఒక ప్రత్యేకతతో తెలుగువారిని ఆకర్షించటం ఆరంభించాయి. అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం', కాళోజీగారి 'జీవనగీత', యువభారతీయుల కవితా సంకలనం 'వీచికలు' తక్కువ ధరకు ప్రచురణ పూర్వ విరాళ పద్ధతిలో వెలువరించిన తొలిప్రచురణలు. 1970 లో 'మారుతున్న

విలువలు: రచయితల బాధ్యతలు' అనే అంశం మీద నిర్వహించిన గోష్ఠి, దానిని 'రచన'గా ప్రచురించిన అనుభవం యువభారతికి కీర్తిప్రతిష్ఠలతోపాటు ఒక ప్రామాణికమైన సాహిత్య సంస్థకు వచ్చే గుర్తింపును గూడా తెచ్చిపెట్టాయి.

1971 - 1985 మధ్య యువభారతి సమాజంలో ఒక అపూర్వ సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. యువభారతి వార్షికోత్సవాల 'లహరి ఉపన్యాస పరంపరలు' ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిచ్చిన 'కావ్యలహరి' తో మొదలయ్యాయి. 1971 లో వేలమంది సాహితీ సభలకు రావటం, సాహిత్యపు విలువలపట్ల సదవగాహన సమాజంలో ఏర్పడటం యువభారతి సాహిత్యోద్యమం కలిగించిన విలువైన చైతన్యం. కావ్యలహరి, కవితాలహరి, చైతన్యలహరి, వికాసలహరి, రామాయణలహరి, నవోదయలహరి, నవ్యసాహితీలహరి, ప్రతిభాలహరి, ఆలోచనాలహరి, సంస్కృత సాహిత్యలహరి, జగద్గురు సాహితీలహరి మొదలైన 'లహరి' ప్రచురణలు సాహితీలోకంలో మన్ననల నందుకున్నాయి.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాలను పురస్కరించుకొని యువభారతి ప్రచురించిన నూరు వ్యాసాల 'మహతి' తెలుగు సాహితీ పరులలో ఒక విలువైన గౌరవాన్ని పొందింది; పరిశోధకుల మన్ననల నందుకున్నది. తెలుగు నవలలను గురించి ఇంగ్లీషులో చెప్పటానికి ప్రయత్నించిన **Telugu Novel** మంచి ప్రయోగంగా ఆదరణ పొందింది. తెలుగులో కవుల కవితా వైభవాలను ప్రచురించే యువభారతి రచనలు ప్రాచీనాధునికాంధ్ర కవులను, భారతీయ భాషా కవులను సరళంగా వ్యాఖ్యానించి చెప్పాయి; చెపుతున్నాయి. యువభారతి ప్రచురించే ప్రతి ప్రచురణా ఆయా సమయాల్లో సమాజంలో కలిగించవలసిన సాహితీ స్పృహను దృష్టిలో ఉంచుకొని రూపొందించేదే. కాలగతిలో అవిచ్ఛిన్నంగా సాగవలసిన సాహితీ రసికత్వాన్ని లహరిగా ప్రవహించేటట్లు కార్యక్రమాలను సాగించటం యువభారతి ప్రవృత్తి!

1991 - 1992 లో యువభారతి రజతోత్సవాలను జరుపుకున్నది. పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 'తెలుగు కవిత : లయాత్మకత' అనే అంశం మీద రజతోత్సవ ఉపన్యాస లహరిని అందించారు. అది గ్రంథరూపంగా వెలువడింది. నెలనెలా మొదటి ఆదివారం సాయంకాలం 5-30 గం॥లకు జరిగే "సమాలోచనం" సమావేశాలన్నీ రజతోత్సవాలలో భాగాలుగా మలచబడ్డాయి. 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం' (1980 - 1990), 'పాతికేళ్ళ పత్రికా

రచన' (1965-1990), యువభారతి రజతోత్సవ సంచిక 'వెండి వెలుగులు', 'అనుభూతి', 'అమృత రాజీవం' కవితా సంపుటాలు రజతోత్సవ ప్రచురణలుగా వచ్చాయి. రజతోత్సవాలలో భాగంగా జరిగిన సదస్సులలోని ఉపన్యాసవ్యాసాల సంకలనాలను 30 వ వార్షికోత్సవాల ప్రచురణలుగా వెలువరించటం జరుగుతున్నది. ఆలోచనలకు అక్షరాకృతి నివ్వటం యువభారతి సాహితీవ్రతం.

యువభారతి 30 వ వార్షికోత్సవాలకు 'వివేకానందలహరి' నిరూపొందించుకొన్నది. శ్రీ స్వామి వివేకానంద చికాగో నగరంలో ప్రపంచ మహాసభలో ఉపన్యసించిన చారిత్రాత్మక సన్నివేశానికీ, స్వామి హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలను సందర్శించిన మరువలేని ఘట్టానికీ శతజయంతి జరుగుతున్న సందర్భాన్ని పురస్కరించుకొని 'వివేకానంద లహరి' ఉపన్యాసాలను ఏర్పాటు చేయాలనీ, ఆ ఉపన్యాసాలను 'వివేకానందలహరి' అనే పేర వెలువరించాలనీ యువభారతి సంకల్పించింది. ఆ సంకల్పాన్ని అక్షరరూపంగా మలచటంలో యువభారతిని ప్రోత్సహించి, ఆశీర్వదించిన పెద్దలకందరికీ యువభారతి కృతజ్ఞతాభివందనా లర్పిస్తున్నది.

యువభారతి రజతోత్సవ సదస్సులలో పాల్గొని తమ ప్రసంగ వ్యాసాలను ప్రచురించడానికి అంగీకరించిన వక్తలు డాక్టర్ రావిభారతిగారికి, డాక్టర్ యన్. నిర్మలాదేవిగారికి, శ్రీమతి కె. అరుణకుమారిగారికి, డాక్టర్ లావణ్య సరస్వతి గారికి, డాక్టర్ వై. కామేశ్వరిగారికి, శ్రీ బి. భుజంగరెడ్డిగారికి, డాక్టర్ కాత్యాయనీ విద్మహేగారికి, శ్రీమతి వి. రామలక్ష్మి (కె.బి. లక్ష్మి) గారికి కృతజ్ఞతాభివందనాలు. యువభారతిని ప్రోత్సహిస్తున్న 'సాహితీ మిత్రు'లకు, 'భారతీ మిత్రు' లకు, 'భారతీ భూషణు'లకు, ప్రకటనదారులకు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు, విప్లా ప్రింటర్స్‌కు మా ధన్యవాదాలు :

వార్షికోత్సవ సభలను స్పాన్సర్స్ చేసి, ప్రకటనల నిచ్చి యువభారతికి చేయూతనిచ్చిన చిన్న మొత్తాల పొదుపు సంస్థ కమీషనరుగారికి మా ప్రత్యేక ధన్యవాదాలు!

యువభారతి నభిమానించే సాహితీలోకానికి మా అభివందన చందనాలు!

హైదరాబాదు,
6-3-1994.

జి. వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు.

# విషయ సూచిక

# స్త్రీవాద కవిత్వం – ఒక పరిశీలన

## (అధ్యక్షోపన్యాస వ్యాసం - మొదటి సమావేశం)

—డా॥ రావి భారతి

"స్త్రీవాద ధోరణులు – సమకాలీన సాహిత్యము" అన్న శీర్షికను ఎంపిక చేయడం చాలా సందర్భశోభితంగా ఉంది. ఎందుకంటే, ఈనాడు స్త్రీవాద సిద్ధాంతాలపైనా, సాహిత్యంపైనా కొందరు అభియోగాలు మోపుతున్నారు. ఎన్నో విమర్శలు చేస్తున్నారు. అవేమిటంటే—

— వీళ్ళు పురుషద్వేషులు.

— కుటుంబ జీవనానికి వ్యతిరేకులు.

— స్థిరంగా ఉన్న ఒక సాంఘిక క్రమాన్ని అస్తవ్యస్తం చేయతలపెట్టిన అరాచక వాదులు.

— మన సామాజిక వ్యవస్థలో ఒదిగిపోని ఆలోచనా ధోరణులను బలవంతంగా స్త్రీలనెత్తిన రుద్దడానికి ప్రయత్నిస్తున్నారు. వీళ్ళ ఫెమినిజం మన స్త్రీల సమస్యలలో నుంచి కాక పాశ్చాత్యుల పుస్తకాల్లోంచి దిగుమతి అయింది. కనుక ఇది ఉన్నతవర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నది.

— వీళ్ళు పోరాటాల్ని, ప్రజల్ని చీల్చడానికి ప్రయత్నిస్తున్నారు. ఇదొక అంతర్జాతీయ కుట్ర.

— అన్నిటిని మించి వీళ్ళు రాజకీయ వ్యతిరేకమైన ధోరణుల్ని అనుసరిస్తున్నారు. ప్రతి స్త్రీ సమస్యనూ భూతద్దంలో చూడడానికి ప్రయత్నిస్తున్నారు.

ఇవి కొన్ని మాత్రమే. ఇలా సిద్ధాంతపరంగా కూడా ఈ స్త్రీ వాదం ఏన్నో విమర్శలకు గురౌతున్నది. ఇలాంటి సదస్సుల్లో చర్చల ద్వారా కొన్ని విషయాలను నిగ్గుతేల్చే ప్రయత్నం చేయవచ్చు.

ప్రపంచ జనాభాను ఆక్రమించే దాదాపు 50 శాతం స్త్రీలు ఏదో ఒక రూపంలో సాంఘిక ఆర్థిక రాజకీయ నైతిక సమస్యల్ని ఏదో ఒక రూపంలో ఎదుర్కొంటున్నారు. శ్రామిక వర్గ స్త్రీలు - మధ్యతరగతి స్త్రీలు - ఫ్యూడల్ సంస్కృతికి సంబంధించిన స్త్రీలు - ఇలా వర్గస్థాయి ననుసరించి భిన్న భిన్న సమస్యలకు లోనౌతున్నారు. గమనించవలసిన అంశమేమిటంటే - సమస్యల యొక్క స్వరూపాలు భిన్నమైనా - ప్రతీ సమస్యపై పురుషాధిక్యత యొక్క ముద్ర స్పష్టంగా కనిపించి తీరుతుంది.

అంతర్జాతీయంగా కూడా స్త్రీలు పురుషులతో పాటు మానవహక్కుల కోసం, ఓటు హక్కు కోసం, వేతన క్రమంలో సమానత్వం కోసం పోరాటాలు చేశారు. చేస్తూ ఉన్నారు.

సాంఘికంగా కూడా ప్రపంచవ్యాప్తంగా స్త్రీ వంచింపబడుతూనే ఉంది. చట్టాలు చేసేది, మత గ్రంథాలు రాసేది మగవాళ్ళే కనుక క్రైస్తవ గ్రంథాలు, ఇస్లాం మత గ్రంథాలు స్త్రీని చాలా నీచంగా చిత్రించాయి. మన వాఙ్మయంలో మనుస్మృతి మొదలు మహాభారతం దాకా స్త్రీని తక్కువ చూపుతో చూసినట్లు సోదాహరణంగా చెప్పొచ్చు. ఒక గమనించదగిన అంశమేమిటంటే - స్త్రీలు ఈనాడు ఏ దేశంలో ఉన్నా సమస్యల స్వరూపాలు భిన్నమైనప్పటికి స్వభావాల అనుభూతులు, సెంటిమెంట్లు, స్పందనలు - వీటిలో తేడాలుండవు. వివాహం, కుటుంబం, మాతృత్వం, ఆర్థికావసరాలు, సాంఘిక సంబంధాలు - ఇవి ఎక్కడ ఉంటాయో అక్కడ సమస్య ఉత్పన్నమౌతాయి. సమస్యలయొక్క పరిపక్వ పరాకాష్టదశను సూచించే చైతన్యం - ప్రతిఘటన - ఈ రెండు ఎక్కడ ఉంటాయో అక్కడే ఉద్యమాలు ఊపిరిపోసుకుంటాయి. ఫెమిస్టు ఉద్యమం అట్లా పుట్టిందే.

అయితే స్త్రీల సమస్యల్ని కేవలం సమస్యలుగానే చూడకుండా వాటి యొక్క మౌలిక రాజకీయ తత్వాన్ని విశ్లేషణాత్మకంగా గుర్తించి మౌలికమైన ప్రశ్నల్ని రేకెత్తించడమే తమ ధ్యేయంగా ఫెమినిస్టులు చెబుతూఉంటారు.

సమాజంలోని సాంఘిక సంబంధాలను, కుటుంబంలో అమలులో ఉన్న పురుషాధికారాన్ని మౌలికంగా ప్రశ్నించడం ఈ వాదం యొక్క ముఖ్యోద్దేశం.

విశ్లేషణ, విమర్శనాత్మకత- ఈ రెండు ఫెమినిజానికి రెండుకళ్లు. నిర్వచన రూపంలో చెప్పాలంటే "ఫెమినిజం ఒక విశ్లేషణా పద్ధతి. జీవితాన్ని, రాజకీయాలను అర్థం చేసుకునే ఒక విధానం. స్త్రీ యొక్క వ్యక్తిగత అనుభవాల ద్వారా కలిగిన అవగాహనతో రాజకీయ పరిష్కారాల్ని సూచించే ఒక సాధనం. అంటే, ఈ విశ్లేషణ నింగినుంచికాక నేలనుంచి మొదలౌతుంది. ఒకే ఒక వాక్యంలో చెప్పాలంటే- సమాజంలో స్త్రీ పరంగా ఆర్థిక రాజకీయ నైతిక రంగాలలో మౌలికమైన మార్పుల్ని కోరడమే ఈ ఉద్యమం యొక్క పరమోద్దేశం."

ఎప్పుడైతే మనం సమస్యల యొక్క మౌలికాంశాల్లోకి వెళతామో వాటికొక చారిత్రక నేపథ్యం తప్పనిసరిగా ఉంటుంది. వాటికొక సిద్ధాంతమూ ఉంటుంది. అది ఉద్యమానికి కరదీపిక లాంటిది. ప్రపంచ వ్యాప్తమైన ఈ ఫెమినిస్టు ఉద్యమానికి మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, L.H. మార్గన్, షీలా రోబోతమ్, ఎలిసన్, ఎమ్‌జగ్గర్, గైల్‌రూబిన్ వంటి ఆర్థిక సాంఘిక రాజకీయ శాస్త్రవేత్తల సిద్ధాంతాలే ఆయువు పట్టులు. ఇవి సాంఘిక ఆర్థిక జీవితాన్ని నడిపించే శక్తుల్ని విశ్లేషించి, తద్వారా ఒక కార్యక్రమాన్ని ఉద్యమాలకు అందిస్తాయి. ఇలాంటి చారిత్రక సిద్ధాంతాల వెలుగులో, శాస్త్రీయ అవగాహనతో సమస్యల్ని విశ్లేషించి విమర్శించే విధానంపై ఫెమినిజం యొక్క శక్తి ఆధారపడి ఉంటుందని వాళ్ళు నమ్ముతారు.

స్త్రీ వాద ధోరణిలోని ప్రధానమైన ఆలోచనలివి:

1. పితృస్వామ్య వ్యవస్థలోని స్త్రీల పతనాన్ని, పురుషాధిక్యతను నిర్మాణ పరంగానూ భావజాలంపరంగానూ చారిత్రక నేపథ్యంలో గుర్తించడం. ఫెమినిస్టు లందరూ పురుషాధిపత్యాన్ని నిర్మూలించాలని కోరుతారు. వారికి కసి పురుషులపైన కాదు, పురుషాధిక్య వ్యవస్థపైన, ఆ భావజాలంపైన. మార్క్సిజం ప్రకారం పురుషాధిపత్యమనేది ఒక భావజాలం. ఆ భావజాలం ద్వారా పెట్టుబడి మానవులను విభజించి పాలిస్తున్నది. ఒక సమాజ ఆర్థిక వ్యవస్థ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థగా మారినప్పుడు జరిగే సాంస్కృతిక విప్లవం ద్వారా పురుషాధిపత్యం పోతుందని మార్క్సిజం చెబుతుంది.

2. సెక్సుకూ జండర్‌కూ మధ్య ఉన్న తేడాను తేటతెల్లం చేయడం. సెక్స్ అన్నది శారీరకంగా ఆడ - మగ భేదాలను గుర్తించి చెబుతుంది. కాబట్టి అది సహజమైనది. జండర్ అన్నది సాంఘికంగా సాంస్కృతికంగా స్త్రీత్వ లక్షణాలనూ స్వభావాలనూ, పురుషత్వ లక్షణాలనూ స్వభావాలనూ వేరువేరుగా ఏర్పరచి, పురుషుల్ని పురుషులుగా, స్త్రీలను స్త్రీలుగా తయారుచేస్తుంది.

3. లైంగికత్వం యొక్క రాజకీయ స్వభావాన్ని నొక్కి చెప్పడం. రాజకీయ తత్త్వవేత్తలందరూ నిర్లక్ష్యం చేసిన సంతానోత్పత్తి, లైంగికత్వం అన్న విషయాలను ఫెమినిస్టులు గుర్తించి పట్టించుకున్నారు. లైంగికత్వం, సంతానోత్పత్తి, ఇంటిచాకిరి - ఇవన్నీ స్త్రీల వ్యక్తిగత విషయాలు కావు, రాజకీయాలతో ముడిపడ్డ విషయాలు లైంగిక సంబంధాలలోని అసమానతల యొక్క రాజకీయ స్వభావాన్ని గుర్తించి దానికి పోరాటరూపాన్నివ్వాలని రాడికల్ ఫెమినిస్టులంటారు. సమాజ రాజకీయ ఆర్థిక వ్యవస్థలో సంతానోత్పత్తి, లైంగికత్వం అనేవి ముఖ్యమైన నిర్ణాయకాంశాలుగా గుర్తిస్తారు. "వ్యక్తిగతం కూడా రాజకీయమే" అన్న నినాదమే దీని సారాంశం.

4. కుటుంబాన్ని ఒక ప్రైవేటు యూనిట్‌గా కాకుండా సాంఘిక పరమైన యూనిట్‌గా పరిగణించడం. భౌతికవాదం ప్రకారం ఉత్పత్తి అనగానే ఆహారం , బట్టలూ, ఇల్లూ మొదలైనవే గుర్తింపబడుతున్నాయి. కాని లైంగిక తృప్తి, పిల్లల పెంపకం, ఇంటిచాకిరి మొదలైన వాటిని ఉత్పత్తిలో భాగంగా చేర్చడంలేదు. కనుక స్త్రీ విముక్తి అసాధ్యమౌతున్నది. స్వేచ్ఛా సమాజానికి ఉత్పత్తి మీద శ్రామికుల కంట్రోలు మాత్రమే సరిపోదు. సంతానోత్పత్తిలో కూడా ప్రజాతంత్ర విధానం ఉండాలి. "పునరుత్పత్తి ప్రజాస్వామ్యం" కావాలంటారు సోషలిస్టు ఫెమినిస్టులు.

ఇలాంటి ఆలోచనలు, సిద్ధాంతాలు ప్రజల్లోకి వెళ్ళడానికి సాహిత్యం ఒక శక్తివంతమైన సాధనంగా ఉపయోగపడుతుంది. ఒకవైపు సిద్ధాంతపరమైన సాహిత్యాన్ని ప్రచారం చేస్తూనే మరోవైపు తమ భావాభివ్యక్తీకరణకు, ప్రచారానికి ముఖ్యంగా కవిత్వాన్ని సాధనంగా గ్రహిస్తున్నారు. తమ కలాలనూ గళాలనూ విప్పుతున్నారు. పెన్నునే ఒక గన్నులా పురుషాధిక్య సమాజంపై గురి

పెడుతున్నారు. స్త్రీల సమస్యలకు భిన్నమైన పద్ధతిలో ప్రతిస్పందిస్తూ కొందరు కవయిత్రులు ఒక నూతన దృక్కోణం నుంచి కవిత్వం రాస్తున్నారు. స్త్రీ మాత్రమే చెప్పగలిగిన విషయాలను కవితా వస్తువులుగా గ్రహించి, స్త్రీ దృష్టి నుంచి కనిపించే స్త్రీ ప్రపంచాన్ని ఏమీ దాపరికం లేకుండా ప్రదర్శిస్తున్నారు. చాలా కవితా ఖండికల్లో ఆర్తి ఉంది, ఆర్ద్రత ఉంది. ఆవేదన ఉంది, ఆవేశముంది. అన్నిటిని మించి సాంఘిక ప్రయోజనముంది. భాషాపరంగా చూస్తే శబ్దప్రయోగంలో శక్తి, భావవ్యక్తీకరణంలో యుక్తి, శబ్దశిల్పంమీద రక్తి కనిపిస్తాయి.

మరొక్క విషయం కూడా మనం గమనించాలి. లోకంలో పురుష ఫెమినిస్టులు కూడా ఉన్నారన్న మాట మరిచిపోకూడదు. చాలావరకు వీరంతా అభ్యుదయవాదులు, జీవితంపట్ల ఒక శాస్త్రీయమైన అవగాహన కలవారు. అటు సామాజికపరంగానూ, ఇటు స్త్రీపరంగానూ మౌలికమైన మార్పుల్ని కోరేవారు. మొదటితరంలో ముఖ్యంగా చెప్పుకోతగినవాళ్ళు చలం, కొడవగంటి కుటుంబరావు. కుటుంబరావుగారి స్త్రీవాదం ఈనాటి రచయిత్రుల్లో చాలామంది పుట్టకముందే పుట్టింది. వీరి స్త్రీవాదం చాలామందికి మింగుడుపడదు. ఒక వ్యాసంలోని ఉదాహరణ మచ్చుకి చూపిస్తాను. "ఆడది తన భర్తమీద ప్రేమకొద్దీ తన పిల్లల మీద ప్రేమకొద్దీ వాళ్ళకు చాకిరీ చేస్తుందనడం కుంటిసాకే. పైపెచ్చు చాలావరకు అబద్ధం. తమ తలిదండ్రులను దివాళా ఎత్తించి కట్నం గుంజి తనను పెళ్ళి చేసుకున్నవాడిని ఏ స్త్రీగానీ ప్రేమించవలసిన అవసరంలేదు. పెళ్ళి చేసుకోకుండా స్త్రీ స్వేచ్ఛగా బతికే అవకాశాలు దాదాపు శూన్యంగా ఉన్న ఈ వ్యవస్థలో స్త్రీ తన భర్తను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నదీ అంటే పోలీసు అనుమానితున్ని చిత్రహింసలు పెట్టి తాను నేరం చేశానని ఒప్పించడం లాంటిది. ఆడది స్వేచ్ఛా వాతావరణంలోనే ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. పెళ్ళి అన్నది నిర్బంధంగా జరిగినంత కాలం ప్రేమ ప్రస్తావన అప్రస్తుతం." (1975 ఫిబ్రవరి - ఆంధ్రజ్యోతి మాసపత్రిక).

ఇకపోతే స్త్రీవాద కవిత్వాన్ని మనం పరిశీలించినప్పుడు అది వ్యక్తిగతంగా పురుషాధిపత్యాన్ని ప్రశ్నించే ధోరణినుండి వ్యవస్థాగత రాజకీయాలతో సంఘర్షించే వరకూ విభిన్న దశల్లో ప్రతిబింబిస్తున్నది. అలాగే పసితనం మొదలు పండబారిన వయసుదాకా వివిధ దశల్లో ఒక స్త్రీ పొందే అనుభూతులు, ఆవేదనలు వ్యక్తీకరింపబడుతున్నాయి.

ఒక ఆడపిల్ల జీవితంలో వివాహమనేది ఒక మధుర భావన. అయితే ఈ పురుషాధిక్య వ్యవస్థలో అవన్నీ కల్లలని గ్రహిస్తుంది. వివాహమంటే ఒక విచ్చుకత్తులబోనులాగా, పెళ్ళంటే పెనుమంటల్లో దూకడంలాగా ఊహించుకునే పరిస్థితులు చుట్టూరా ఉన్న సమాజం కల్పిస్తున్నది. ఒక ఆడపిల్ల స్వగతం సావిత్రి కవితలో ఇలా వినిపిస్తుంది.

"పాఠం ఒప్పజెప్పకపోతే
పెళ్లి చేస్తానని
పంతులుగారన్నప్పుడే భయం వేసింది.
ఆఫీసులో నా మొగుడున్నాడు
అవసరమున్నా సెలవివ్వడని
అన్నయ్య అన్నప్పుడే
అనుమానం వేసింది.
వాడికేం మహారాజని
ఆడా మగా వాగినప్పుడే
అర్థమైపోయింది.
పెళ్లంటే పెద్దశిక్షని
మొగుడంటే స్వేచ్ఛాభక్షకుడని
మేం పాలిచ్చి పంచిన జనంలో సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తోందని."

ఈ పురుషాధిక్య సామాజిక పరిభాషలో "పెళ్లి" "మొగుడు" పదాల అర్థాలు ఎలా వ్యాకోచం చెందాయో అర్థం చేసుకోవచ్చు.

తరతరాలుగా వంట యింటికే అంటుకొనిపోయి వండుతూ వారుస్తూ వడ్డిస్తూ ఏమాత్రం సామాజిక ఉత్పత్తిలో భాగం పంచుకోలేని యాంత్రిక జీవనం స్త్రీ గడిపింది. అయితే ఆధునిక యువతి మారుతున్న విలువలకు అనుగుణంగా ప్రతిస్పందిస్తూ తన స్థానం కేవలం వంట యింట్లో కాదనీ, సామాజిక చైతన్యపు వెలుగులోకే తన ప్రయాణమని గుర్తించింది. విమల కవితలో వినాలంటే -

"మా అమ్మొక ప్రేతంలా తేలుతూ ఉంటుందిక్కడ
అసలు మా అమ్మ నడుస్తున్న వంటగదిలా ఉంటుంది."

కనుక మన పిల్లలకోసం వంటరి వంటగదులు కూల్చేందుకు రండి అంటూ వంటింటి సంస్కృతిపై యుద్ధం ప్రకటిస్తున్నది.

గజ్జెల మల్లారెడ్డిగారు కూడా ఈ సమస్యకి స్పందించారు:
"వంటయిల్లే ఖైదుకొట్టయి
పడకటిల్లే పంజరమైన్మ
అందరికి తలవంచి బతికే
అబల సబలగ మారినపుడే"

స్త్రీయొక్క బానిస సంస్కృతి బద్దలౌతుందన్నారు.

స్త్రీవేధింపు చర్యలు ఈనాడు అనేక విధాలుగా సాగుతున్నాయి. సంఘ వ్యతిరేకశక్తులు, రౌడీలు, ఆకతాయి ముఠాలు ఈ దుశ్చర్యలకు పాల్పడుతున్నారు. దీనికి కారణం స్త్రీ కేవలం భోగవస్తువనే అనారోగ్య భావన. ఈ వస్తువు ఆధారంగా కొన్ని కవితలు వెలువడ్డాయి. కొల్లూరి "స్త్రీ" అనే ఒక వచన కవితా ఖండికలో—

''అడవి మృగాల మధ్యనుండి
నిలువునా చూపులతో పొడుచుకుతినే కాకుల నుండి
ఈ విష నాగరిక ప్రపంచపు అంచులపై బతుకు'' సాగిస్తూనే ఉంటుందని సమస్యను ఒక సమస్యగానే మన ముందుంచారు. అయితే కవయిత్రి జయప్రభ మరో అడుగు ముందుకువేసి ఆ చూపుల్లోని వికృతిని భయంకృతిని అసహ్యాన్ని ఎదుర్కొని ఎలా ప్రతిఘటించాలో కూడా సూచించారు:

"ఇప్పుడు ఆ కళ్ళని వెంటాడడానికి
కళ్ళతోనే యుద్ధం చేస్తాను.
కళ్ళకేకాదు
ఈ దేశంలోని ఆడదాని
వళ్ళంతా ముళ్ళుండేరోజు
ఎప్పుడొస్తుందా" అని ఎదురుచూస్తున్నానని తన ఆవేదనని వ్యక్తం చేశారు.

శ్రీమతి వాణీ రంగారావుగారి ఒక కవితలో (పేరు జ్ఞాపకంలేదు) తన కూతురు పెళ్ళి తరువాత ప్రతీ క్షణం చస్తూ చస్తూ ఎలా బ్రతుకుతున్నదో ఒక తల్లి యొక్క ఆవేదనను వ్యక్తీకరించిన విధానం చాలా ఆర్ద్రంగా ఉంది. నిజంగా అది చదివి నేను కళ్ళనీళ్ళు పెట్టుకున్నాను. అది కోట్ చెయ్యాలనుకుని దురదృష్టవశాత్తు ఆ పుస్తకం హైద్రాబాద్‌లోనే వదిలి వచ్చాను.

లింగ నిర్ధారణ పరీక్షను మూలంగా చేసుకొని ఈ వ్యవస్థలోని స్త్రీ యొక్క అస్తిత్వవేదనను ఈశ్వరి, పాటిబండ్ల రజని - వీరిద్దరూ భావించిన తీరు అద్భుతంగా ఉంది. ఒక మాతృమూర్తి నోట ఆవేదన ఇలా అక్షరరూపం దాల్చింది:

''నీకూ మంచిరోజు లొస్తున్నాయిరా కన్నా
ఆడదిగా పుట్టానని అడవిలో మానైనా కాలేదని
విలపించే రోజులు
పోతున్నాయిలే తల్లీ
ఎందుకంటే
నీవు అమ్మ పొట్టలోంచి
బైటికే రావుగా" (ఈశ్వరి)

కడుపుచుమ్మలు చుట్టించే ఆ మాతృమూర్తి ఆర్తి మన సంస్కృతిని ఆకాశానికెత్తే నాగరిక సమాజం సిగ్గుపడేటట్లు చేస్తున్నది. మాతృహృదయాన్ని విలవిలలాడించే గర్భవిచ్ఛిత్తి గురించి పాటిబండ్ల రజని కవితలో ఆక్రోశం కనిపిస్తుంది.

''కంసుడి కత్తిలాంటి ప్లాస్టిక్ బకెట్ మింగిన
ప్లాస్టర్ ఆఫ్ పారిస్ ముద్దలాంటి నిన్ను చూసి
మళ్ళీ నా పొత్తిళ్ళలో పొదువుకోవాలనీ
పాలకై తడవుకునే పెదవులుగా
అమ్మకై వెదుక్కునే చూపులుగా చెక్కుకోవాలనీ
ఇంత సుఖంగా నిన్ను చంపుకునే మార్గం కనిపెట్టిన వీళ్ళ ముఖాలపై
ఉమ్మనీళ్ళతో ఉమ్మెయ్యాలనీ వెర్రి ఆవేశంగానూ ఉందిరా!"

—ఒకే సన్నివేశానికి సంబంధించిన ఈ రెండుకవితల్లో మొదటిదాంట్లో ఆలోచనను ప్రేరేపించే శక్తి ఉంది. గాంభీర్యముంది. రెండోదాంట్లో ఆవేశమూ, దానితోపాటు ఈ వ్యవస్థపై కసి, ఆక్రోశం కనిపిస్తాయి.

ఈ వ్యవస్థ యొక్క అనేక వికృత రూపాల్లో వేశ్యావృత్తి ఒకటి. ఈ సామాజిక రుగ్మతను అతి శక్తివంతంగా వ్యక్తీకరించగలిగిన కవయిత్రులు ఒకరు ఘంటసాల నిర్మల, మరొకరు ఓల్గా. వీరిద్దరూకూడా సజీవ సంఘటనలకు స్పందించి వాళ్ళ స్వగతాలకు అక్షరరూపాన్నిచ్చినవాళ్ళే.

ఓ సాయంత్రం విజయవాడ సెంటర్లలో మెడలో వేశ్యల బోర్డు కట్టి ప్రదర్శించిన సంఘటనకు బలంగా స్పందించిన నిర్మల ఇలా రాశారు:

"వేలవేల వీర్యాల వర్షాల్ని
కళ్ళు మూసుకునైనా భరిస్తున్నదాన్ని
రంగులుచిట్లిన రతిరోతకు జ్వరిస్తున్నదాన్ని" - అంటూ ఒక పడుపు కత్తె తన బతుకులోని జుగుప్సతో పాటు తనపై తనకున్న విశ్వాసాన్ని ప్రకటిస్తుంది.

హైద్రాబాద్‌లోని మెహందీబజారులో ఒకనాడు ఒకడు ఒకమ్మాయివద్దకు వచ్చి పడిపోయి ఆ తరువాత ఆస్పత్రిలో మరణించాడు. ఆ నెపంతో పోలీసులు ఆ వాడలో బీభత్సాన్ని సృష్టించిన సందర్భంలో వాళ్లను పరామర్శించడానికి వెళ్ళిన రచయిత్రి శ్రీమతి ఓల్గా ఆ స్త్రీల విజ్ఞప్తి మేరకు పత్రికలలో ఆ వార్తకు కవితా రూపాన్ని ఇచ్చి ప్రకటించారు-

"ఓ మగమదమృగాల్లారా
మీరు మీ ఇళ్లల్లో చావండి
మీరు మీ భార్యల ఒళ్లలో చావండి
మీ తల్లుల గుండెలపై చావండి
మీరు చావటానికి మా దగ్గరకు రాకండి
బతకటానికి నానా చావూ చస్తున్నవాళ్లం."

ఈ కొసమెరుపు ఎంత శక్తివంతంగా ఉందో గమనించాలి. అలాగే శారీరకంగా, మానసికంగా గాయపడ్డ వేశ్యల చప్పుళ్ల స్వగతాలను బి. మల్లికార్జున్‌గారు వినిపించారు.

ఈ యాంత్రిక యుగంలో - ఆత్మీయతలు, అనుబంధాలు తలక్రిందు లౌతున్న ఈ వ్యవస్థలో - తల్లికున్న స్థానం ఎలాంటిది? తన జీవితాన్నంతా మురిపాల బిడ్డలకోసం ముడుపుకట్టి కష్టపడి పెంచి యోగ్యులుగా తీర్చిదిద్దాననుకుంటుంది. అయితే జీవితసంధ్యా సమయంలో శారీరకంగా, మానసికంగా అలసిపోయినదశలో ఎవరికీ అక్కరలేని అమ్మ మానసికక్షోభ సునీత కవితలో-

"కడుపున కన్నవాళ్లు
కసురుకున్నందుకు
పేగు చించుకు పుట్టినవాళ్లు
ప్రేమ భిక్ష రాల్చనందుకు
ఎదిగిన బిడ్డల మధ్య
ఏకాకి అయినందుకు
పసిపిల్ల చేష్టలా
అమ్మ అలిగింది."

ఒకనాడు విసుగూ విరామం లేకుండా వండి వడ్డించి తినిపించిన అమ్మ ఈనాడు తినక అలిగినా అడిగేనాథుడే లేడు. ఆ తల్లిముఖాన్ని జయప్రభగారు "పూర్తిగా ముడుతలు పడిపోయిన తీపి ఖర్జూరపు పండు"తో పోల్చి, ఆ భావ చిత్రాన్ని మన మనసులో శాశ్వతంగా అచ్చొత్తించారు. త్యాగమూర్తి తల్లి ఉనికిని విస్మరించే కృతఘ్నులనుద్దేశించి చిత్రదీపాల కవి ఆచార్య గోపి,

"బ్రహ్మదా!
అమ్మ ఋణం తీరదురా
అమ్మకు అమ్మవై పుడితే తప్ప" అని హెచ్చరించారు.

సామాన్య ప్రజానీకంలో నుంచి ఉద్యమమే ఊపిరిగా పుట్టిన కవిత్వం మహా శక్తిమంతంగా ఉంటుంది. ఉద్యమాల్లాగే ఉద్యమ కవిత్వంకూడా అట్టడుగు

వర్గాలనుంచే ఉబికి వస్తుంది. నిజాం నిరంకుశపాలనకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాటకాలంనుంచీ ఈనాటిదాకా ప్రజాసాహిత్యం ఒక కొత్త ఒరవడికి నాంది పలికింది. గ్రామీణ వ్యవస్థ యొక్క విషపుకోరల్లో చిక్కుకున్న స్త్రీలు అటు మగవాళ్ళ ఆధిపత్యానికీ, అత్యాచారాలకూ; ఇటు భూస్వామ్య దోపిడికి ద్విముఖంగా బలైపోతున్న ఘట్టాలెన్నో కవితారూపాన్ని పొందాయి. ఇలాంటి పోరాట కవిత్వ రచనలో స్త్రీలు ఎక్కువగా పాలుపంచుకున్నట్లు కనిపించదు. వాటిలో శివసాగర్ రాసిన చెల్లీ చెంద్రమ్మా అన్న గీతం, గద్దర్‌రాసిన పాటల్లోని "సిరిమల్లెచెట్టుకింద" అన్నగీతం ముఖ్యమైనవి. అత్యాచారాలు అవధిమించిపోయిన స్థితిలో పోరాటాలు పుట్టుకొస్తాయన్న నిజాన్ని చెల్లీ చెంద్రమ్మా నిరూపిస్తుంది. అలాగే గ్రామీణ జీవనంలోని దుర్భర దారిద్ర్యం వల్ల స్త్రీ బ్రతుకు ఎలా భారంగా పరిణమిస్తుందో గద్దర్ రచన చెబుతుంది. ప్రజల గుండెల చప్పుళ్లను డప్పులుగా మార్చి దండోరా వేసిన కవి గద్దర్.

అలాగే రాజకీయ పోరాట అవగాహనతో రాసిన కవిత అనామిక గీతం. ఇందులో సమష్టి పోరాటాలకు ప్రాధాన్యం కనిపిస్తుంది. ఈ కవితలోని "కాంక్రీటు పంజరాలకు కట్టిన కుట్ర" అన్న వాక్యంలో దోపిడీ స్వభావమంతా ఇమిడి ఉన్నది. ఇది శ్రామిక సంఘటిత శక్తి నాశ్రయించిన కవిత. అలాగే మార్క్సిస్టు పోరాట చైతన్యంతో విప్లవాత్మకమైన స్త్రీ వాద కవితల్ని రాసిన వాళ్ళలో విమలను పేర్కొనవచ్చు. "అడవి ఉప్పొంగిన రాత్రి" కవితా సంపుటిలోని ప్రధాన విషయం వర్గపోరాటం.

ఈ స్త్రీవాద దృష్టి ఇతర ప్రక్రియల్లోకి కూడా విస్తరించింది. ఓల్గా రాసిన ఆకాశంలో సగం అన్న నవల, శ్రీమతి జయప్రభ రాసిన భావకవిత్వంలో స్త్రీ అన్న సిద్ధాంత వ్యాసం, తెలుగులో ఆధునిక నాటకంపై విమర్శ ఈ దృక్పథంతో వెలువడ్డవే. భావకవిత్వం కూడా పురుషాధిక్య సమాజపు భావజాలం నుంచి పుట్టిందేననీ; భావకవి స్త్రీపట్ల ఎంత ప్రేమను ఒలకబోసినా ఆమెను మార్చడం పట్ల ఆసక్తి చూపలేదన్న అంశాన్ని ఒక ఫెమినిస్టుగా ఒక కొత్త వెలుగులో స్త్రీని చూపడానికి సాహసించింది. "నాలుగో గోడ, తెలుగులో ఆధునిక నాటకం" అన్న విమర్శనా గ్రంథంలో తెలుగు నాటకరంగం కప్పుకున్న బూటకపు ముసుగుల్ని నిర్మొహమాటంగా తొలగిస్తూ చేసిన రచన అంటున్నారు సమీక్ష

కులు. "కథ- 91" సంకలనంలో కూడా ఈ స్త్రీవాద ధోరణి కొన్ని కథానికల్లో కనిపిస్తుంది. ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి రెక్కలు, R. M. ఉమామహేశ్వర రావు రాసిన "బిడ్డలుగల తల్లి," శ్రీ కవనశర్మ గారి "విడాకులు" ఈ కోవకు చెందినవి.

ఈ మధ్య స్త్రీవాద సాహిత్యం - ముఖ్యంగా కవిత్వంపై వార్తాపత్రికల్లో వస్తున్న అనుకూల - ప్రతికూల విమర్శలు చాలామంది పాఠకుల్లో ఆసక్తిని పెంచుతున్న విషయం విదితమే.

ప్రతికూల వాదాలు ఇలా ఉన్నాయి:

— ఈ కవయిత్రులు పాఠకులకు చైతన్యం కలిగించడానికి రాస్తున్నారా? లేక సంచలనం సృష్టించడానికి రాస్తున్నారా?

— స్త్రీల వర్గ చైతన్యాన్ని దెబ్బకొడుతూ కేవలం వైయక్తిక వికారాలకు కవిత్వాన్ని పరిమితం చేస్తున్నారు. ఈ కవితలు మొత్తం స్త్రీజాతికి ప్రాతినిధ్యం వహించడం లేదు. (ఎస్వీ)

— అవయవ ప్రతీకలు శరీర ధర్మాలు సృష్టి చర్యలు నీలి కవితల్ని సృష్టిస్తున్నాయి. ప్రపంచ క్రమాన్ని సెక్సుపరంగా చూచే ధోరణి ఆత్మన్యూనతా భావంనుండి పుట్టిన వికృత ఆవేశానికి నిరాశా నిస్పృహలకు సంబంధించింది. శరీర దృష్టితో సామాజిక ధర్మాన్ని తిరస్కరిస్తున్నారు. సామాజిక స్పృహకంటే శారీరక స్పృహ పెరుగుతున్నది. (జ్వాలాముఖి)

— వీళ్ళు తమ కవితల్లో సామూహిక సమస్యలకు ప్రాధాన్య మివ్వకుండా వైయక్తిక అనుభవాలను జుగుప్సాకరమైన పదజాలంతో వర్ణిస్తున్నారు. సామాజిక భూమికకు దూరమౌతున్నారు.

— ఈ ఉద్యమం లింగ వివక్షకు పరిమిత మౌతున్నది.

— ఈ రచనలు స్త్రీల ఆర్థిక సామాజిక రాజకీయ దోపిడీని ప్రతిబింబించడం లేదు.

ఇక అనుకూల విమర్శల్ని చూద్దాం :

— ఈనాడు కవయిత్రులు నిస్సంకోచంగా రాయడానికి కావలసిన సాహిత్య వాతావరణాన్ని ఎన్నడో దిగంబర కవులే సృజించారు. (చేరా)

— కవయిత్రుల గాఢమైన, స్వానుభవపూర్వకమైన ఆర్తి, ఆక్రోశం, ఆగ్రహాలు, నిర్భయత్వం, నిజాయితీలను అపార్థం చేసుకుంటున్నారు. (వరవరరావు).

— అనివార్యంగా ఉపయోగించబడే లైంగిక పరిభాష అశ్లీలం కాదు, లైంగిక ప్రేరణను కలిగించనంతవరకు, ఆ సమస్యపట్ల సానుభూతి కలిగించినంతవరకు లైంగిక పరిభాష, ప్రతీకలు ప్రయోగించడంలో తప్పులేదు. (పాపినేని శివశంకర్).

మొత్తంమీద ఈ సాహిత్యంపై జరుగుతున్న చర్చ విమర్శయొక్క ప్రమాణాలను పడగొట్టే దిశగా ప్రయాణం చేస్తున్నది, ఇది అంత ఆరోగ్యదాయకం కాదని కొందరు అభిప్రాయపడుతున్నారు. (కాత్యాయని.)

అయితే ఒక్కమాట మాత్రం నిజం. ఈ వాదోపవాదాలు పాఠకుల్లో ఎంతగా ఆసక్తిని పెంచుతున్నాయో అంతగా ఆలోచనల్ని రేకెత్తించడంలేదు. విమర్శ వ్యక్తిగత స్థాయికి దిగజారిపోయి, గంభీరమైన స్త్రీ సమస్యనే పక్కదారి పట్టిస్తున్నాయి.

ఏ సాహిత్యం ఎంతకాలం నిలుస్తుంది, ఏ ఉద్యమం ఎంతకాలం జీవిస్తుంది అని జోష్యం చెప్పేది వ్యక్తులు కాదు- ప్రజలు నిర్ణయిస్తారు, పాఠకులు నిర్ణయిస్తారు. ఒక్క మాటలో కాలం నిర్ణయిస్తుంది. కవితా రంగంలో కొత్త ధోరణులు తలెత్తినప్పుడు విమర్శ ప్రతివిమర్శలు ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లాగా కవిత్వాన్ని చైతన్యవంతం చేస్తాయి. నిగ్గు తేలుస్తాయి. అయితే, ఆ విమర్శ వ్యక్తిగత స్థాయికి దిగజారకూడదు. స్త్రీలు కవిత్వం రాస్తున్నారంటేనే "ఏ పనీపాటూ లేని ఆడవాళ్ళ సమాన హక్కుల గోల" అని ప్రవచించడం తిరోగమన మార్గంలో ప్రయాణం చెయ్యడమే ఔతుంది కవిత్వం రాసే ఆడవాళ్ళంతా గయ్యాళులు అనడం సమస్య యొక్క గంభీరతను ఎగతాళి చెయ్యడమేఔతుంది.

కనుక, ఒక రచన స్త్రీదా, పురుషునిదా అని కాకుండా రచనని రచనగా విమర్శిం చాలి. సిద్ధాంత సమన్వయంలో ఉన్న లోటుపాట్లేమిటి? కవితా వ్యక్తీకరణలో ఉన్న అవకతవకలేమిటి? అవి సామాజిక ప్రయోజనాన్ని ఎలా దెబ్బతీస్తున్నాయి? అని నిష్పక్షపాతంగా, కుతర్కాలకు తావులేకుండా, పాఠకుల్ని వక్రమార్గం పట్టించకుండా చేసే విమర్శ ఆహ్వానించదగ్గది.

నిజానికి ఏ రచయిత్రి కూడా కేవలం ఋతు ధర్మాలకూ, అవయవ ప్రతీకలకూ, సృష్టిచర్యలకు మాత్రమే పరిమితం కాలేదు. మొత్తం రచనల్లో ఒక అయిదు శాతం ఈ నీలి కవితల్లాంటివి కనిపిస్తాయి. కవిత్వీకరణంలో అనివార్యంగా ఒక సామాజిక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు, ఇక ప్రత్యామ్నాయ పదమేదీ అందుబాటులో లేని సందర్భంలో అలాంటి పద ప్రయోగం ప్రమాదకరమేమీ కాదు. "వేలవేల వీర్యాల వర్షాలు" అన్న ప్రయోగం ఒక వేశ్యావ్యవస్థలోని రుగ్మతకు అద్దం పడుతున్నది. మన సంస్కృతికి మారు పేరుగా చెప్పుకుంటున్న మహాభారతంలోనే ద్రోణాచార్య, కృపాచార్య జన్మ వృత్తాంత సందర్భంలో వీర్యం, శుక్లపాతం, రేతస్కందం లాంటి పదాలు ఎన్నో చోటుచేసుకున్నాయి. అక్కడలేని అభ్యంతరం ఇక్కడ కూడా అవ సరం లేదు. ఇకపోతే అయిదుశాతమే అయినప్పటికి ఋతు ధర్మాల్ని, శారీరక ధర్మాల్ని, సృష్టి చర్యల్ని అతిగా వర్ణించడం పట్ల నాకు కూడా కొన్ని అభ్యంత రాలున్నాయి. కవిత్వంలో ఆవేశం దించాలి కాని, ఆ ఆవేశం ఆలోచనను మింగి వేసి జుగుప్స కలిగించకూడదు. ఋతు ధర్మ సమయంలో దూరాన్ని పాటిం చడం ఒక కాలం చెల్లినమాట. ఏ వర్గ స్త్రీలు కూడా ఇప్పుడు పాటించడంలేదు. అలాగే లైంగిక సంబంధ రుగ్మతలకు స్త్రీ పురుష భేదం లేదు.

నిజం చెప్పాలంటే, ఈ పద ప్రయోగానికి అంతగా ప్రాముఖ్యమియ్య వలసిన అవసరం లేదు. సిద్ధాంత అవగాహనలో లోపాలు, సమన్వయంలో అవకతవకలు, వ్యక్తిగత నిందలు, సెంటిమెంట్లకు లోనుకావడం, ఒక కమిట్ మెంట్ లేకపోవడం- ఇవి అంతకంటే ప్రమాదకరం. ఇవి స్త్రీవాదాన్నే పక్క తోవ పట్టిస్తాయి ఒక వైపు ఫ్యూడల్ వ్యవస్థను దుయ్యబడుతూనే మరొక వైపు చకోరాలు, హంసలు, జలతారు ముసుగులు, రుద్రనృత్యం లాంటి పదజాలాన్ని ప్రయోగించడం (జయప్రభ) మరోవైపు పురుషాహంకార స్వభావాన్ని చిత్రి

స్తూనే మరోవైపు సెంటిమెంట్లకు తలవంచడం. ఇలాంటి పరస్పర విరుద్ధ భావ వ్యక్తీకరణ కనిపిస్తుంది. ఉదాహరణకు ప్రకృతిలో ప్రళయం అన్న కవితలో ఒకచోట.

"కపటపు వాగ్దానాలతో
నీ జీవితాన్ని బంధించి
మోసంతో నిన్నొక బానిసగా మార్చి
పెళ్ళి అనే ఊబిలోకి దింపినా
క్షమిస్తావు దేనికి?" అని స్త్రీని ఒక వైపు "పెళ్ళి" అనేది ఎలా exploit చేస్తుందో చెబుతూనే మరోచోట,

"భర్తగా స్నేహితునిగా
నీ ప్రేమ అపురూపం
నీతో జీవితం కవితా గీతం" అంటూ ఆ భావ జాలానికి తలవంచడం చూస్తే కొంత కమిట్‌మెంటు లోపించిందేమో అనిపిస్తుంది. ఇలాంటి రాతలకు పాఠకులు అయోమయంలో పడిపోక తప్పదు. ఎంత ఫెమినిస్టయినా వ్యక్తిగతానుభూతులు, అనుభవాలు ఎవరికీ తప్పవు. వాటిని మనసులోనే భద్రపరచుకోవాలికాని రాతల్లో కెక్కించి రాజకీయం చేయడం భావ్యం కాదు. పరిశీలించి చూస్తే ఇలాంటి అవక తవకలు కనిపిస్తాయి.

అయితే, ఈ సాహిత్యం యొక్క వయసు చాలా చిన్నది. తప్పటడుగులు తప్పవు. ప్రాథమిక దశలో ఉన్న ఏ ఉద్యమ కవిత్వమైనా ఆటుపోట్లకు గురికాక తప్పదు. అయితే ఎప్పటి కప్పుడు పాఠకుల, ప్రజల నాడిని గమనిస్తూ, ఆత్మవిమర్శ చేసుకుంటూ పురోగమించడంపైనే దాని భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది.

# స్త్రీవాద ధోరణులు – సమకాలీన సాహిత్యం

(అధ్యక్షోపన్యాస వ్యాసం - రెండవ సమావేశం)

—డా॥ యన్. నిర్మలాదేవి

సభకు నమస్సులు. యువభారతి రజతోత్సవ శుభసందర్భంలో స్త్రీవాద సాహిత్యంపైన ప్రత్యేక సదస్సు నేర్పాటు చేయడం ఎంతైనా సంతోషింప దగిన విషయం. దీనికి అధ్యక్షత్వాన్ని వహించే అవకాశాన్ని నాకు కల్గించినందుకు యువభారతి కార్యనిర్వాహకవర్గానికి నా కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను.

గత రెండు దశాబ్దాలుగా 'ఫెమినిజం' అంటే 'స్త్రీ వాదం' అన్ని రంగాల్లోనూ బలం పుంజుకుని ఒక ఉద్యమ రూపాన్ని దాల్చింది. నేడు ప్రత్యేకంగా 'స్త్రీ వాదం' పైన అనేక సదస్సులు నిర్వహించటమే స్త్రీవాద ధోరణులు ఎంతగా సమాజంపైన, సాహిత్యంపైనా తమ ప్రభావాన్ని వేస్తున్నాయో స్పష్ట పరుస్తుంది.

స్వేచ్ఛా సమానతలు ప్రాతిపదికగా గల మానవ విలువలతో ప్రాదుర్భవించిన ఫ్రెంచివిప్లవ చైతన్యస్ఫూర్తితోనే స్త్రీ వాదం కూడ రూపొందింది. మొట్టమొదట ఓటుహక్కు-కోసం బ్రిటన్‌లోని మహిళలు సాగించిన పోరాటము, త్యాగాల ఫలితంగా వారికే కాకుండా మన భారతీయ మహిళలకు ఓటు హక్కు లభించింది. నాటి బ్రిటిష్ ఫెమినిస్టులు పురుషుల్లాగే తామూ మానవులమేనంటూ ఓటు హక్కు, చదువుకునే హక్కు, పార్లమెంటుకెళ్ళే హక్కు, గర్భనియంత్రణ హక్కు మొదలైన మరికొన్ని హక్కులను కోరి సాధించారు. దీనినే లిబరల్ ఫెమినిజంగా పేర్కొంటారు.

పితృస్వామ్య వ్యవస్థలో స్త్రీల శ్రమనీ, లైంగికతనీ, పునరుత్పత్తి శక్తినీ ఒకానొక పద్ధతిలో అదుపు చేస్తున్న తీరుతెన్నులను పరిశీలించవలసిన ఆవశ్యకతను గుర్తించాలని భావించారు. పితృస్వామ్య వ్యవస్థవల్లనే 'స్త్రీ' అణచివేతకు గురి అవుతోందనీ దాన్ని రాజకీయంగా ఎదుర్కోవాలనే వాదాన్ని 'రాడికల్ ఫెమినిజం'గానూ —

పితృస్వామ్యం ముఖ్యమేగానీ వర్గమే వైరుధ్యమనీ ఉత్పత్తి విధానాల మార్పువల్ల స్త్రీల అణచివేత కూడా తొలగిపోతుందనే వాదం మార్క్సిస్టు ఫెమినిజంగానూ-

ఏ సమాజంలోనైనా ఉత్పత్తి సంబంధాలనే కాక పునరుత్పత్తి సంబంధాలనుకూడా పరిశీలించాలనేది 'సోషలిస్టు ఫెమినిజం'గానూ పేర్కొవడం జరుగుతోంది.

ఈ విధంగా మొదట ఓటింగ్ హక్కు, తర్వాత ఆర్థిక హక్కుల సాధనకు, ప్రాతినిధ్యంలో భాగస్వామ్యానికి 'స్త్రీవాదం' యేళ్ళ తరబడిగా పోరాటాన్ని సాగిస్తూనే వుంది.

అంతర్జాతీయ మహిళా సంస్థ ఆవిర్భవించాక స్త్రీవాద ప్రభావం దేశదేశాల్లోనూ ప్రసరించి బలపడసాగింది. పితృస్వామ్య వ్యవస్థలో పురుషాధిక్యతాహంకారాలకు స్త్రీ యేవిధంగా గురి అవుతుందో, అణగద్రొక్క బడుతుందో, ఆమె శ్రమమూల్యం ఏ రకంగా దోపిడీ చేయబడుతూందోననే విషయాల మీద వివేచనాత్మకమైన చర్చోపచర్చలు సాగుతున్నాయి. సాంఘిక, రాజకీయ, ఆర్థికాది రంగాలన్నిటా స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించడానికి అలజడులు - ఆందోళనలు ఆరంభమై, ఉద్యమస్థాయి నందుకుంటున్నాయి. మహిళా దశాబ్దానంతరం (1975-85) ఈ స్త్రీవాదం ప్రపంచదేశాల్లో మరింతగా ప్రజ్వరిల్ల సాగింది.

వ్యక్తిత్వ వికాసానికి లింగభేదం అడ్డు కారాదనీ స్త్రీ వ్యక్తిత్వాన్ని కించ పరిస్తే సహించేది లేదనీ హెచ్చరిస్తోంది. స్త్రీకి శారీరక మానసిక స్వేచ్ఛని వాంఛిస్తుందీ స్త్రీవాదం. స్త్రీయొక్క పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడి, పరిపూర్ణ జీవితానంద సౌఖ్యాలను కలిగించాలనేదే స్త్రీవాదం యొక్క ఆశయం. తత్సాధనకు పోరాటం సాగించడమే దాని లక్ష్యం. ఈ లక్ష్య సాధనకు స్త్రీజాతి ను త్తేజపరచి, చైతన్యవంతం చేసి కార్యోన్ముఖులనుగా స్త్రీలను గావించటమే స్త్రీవాద సాహిత్య ప్రయోజనంగా భావిస్తున్నారు స్త్రీవాదులు.

స్త్రీ వాదులపైన అపోహలు, అనుమానాలు, అపార్థాలు అనేకం విన వస్తున్నాయి. వారు పురుషద్వేషిణులనీ కుటుంబ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసి సమాజంలో శాంతిసౌఖ్యాలను భంగపరిచేటందుకు 'ముసలం'గా దాపురించారనీ, నీతి నియమాలను భ్రష్టు పట్టించే స్వైరిణులనీ కొందరు ఆగ్రహోదగ్రులవు తున్నారు. మరికొందరు- తీరి కూర్చుని వితండవాదన చేసేవారంటూ అవహేళన చేస్తున్నారు.

నిజానికి స్త్రీ వాదులు పురుష ద్వేషులు కారు. పురుషాధిక్యతను ద్వేషి స్తారు. వివాహ వ్యవస్థను కాదు వారు ధిక్కరించేది - నేటి వివాహ వ్యవస్థలోని అస్తవ్యస్తతను తిరస్కరిస్తున్నారు. పురుషుడిలోని అమానుషత్వాన్ని, పాశవికతను నిర్మూలించాలన్నదే వారి ధ్యేయం. స్త్రీ వాదంలోని ఆశయాలను, లక్ష్యాలను దృష్టిలో నుంచుకుని చేసే రచనలే స్త్రీవాద సాహిత్యంగా పరిఢవిల్లుతున్నవి.

స్త్రీవాద రచనలను స్వంత సమస్యలుగానూ స్వంత అసౌకర్యాల అను భూతుల గొడవలుగానూ కాకుండ సామాజిక సమస్యలుగా గుర్తించాలనీ లైంగి కత్వాన్నీ సంతానోత్పత్తినీ సామాజిక పునాదిలో భాగంగా భావించాలనీ వాటి పైన ఎటువంటి ఆంక్షలు, నిర్బంధాలున్నాయనేదాన్నిబట్టే సమాజంలో స్త్రీ స్థానమూ ప్రతిపత్తీ ఆధారపడి వుంటుందనీ, వాటిని పూర్తిగా స్త్రీల సమస్యలే ననుకోకుండా సామాజిక సమస్యలుగా గుర్తించి తగిన చర్యలు తీసుకున్నప్పుడే సమాజంలోనూ, దానిలోని స్త్రీ స్థానంలోను మార్పు వస్తుందంటారు స్త్రీవాదులు. స్త్రీని కేవలం పురుషుని కామవాంఛను తీర్చేదిగానూ సంతానాన్నికనే యంత్రం గానూ భావించే సామాజిక వ్యవస్థమీద తిరుగుబాటు చేస్తున్నారు.

ఈ స్త్రీవాదం పూర్తిగా పాశ్చాత్య దేశాలనుండి మనకు సంక్రమించింది గాదు. మనదేశంలోని స్త్రీల స్థితిగతుల కనుగుణంగా తలెత్తి బలం పుంజుకుని నేడు ఉద్యమ రూపాన్ని ధరించింది. కనుక భారత దేశంలోని స్త్రీవాద ప్రాదుర్భావ వికాసాలనీ, స్త్రీవాద ధోరణులను ప్రతిబింబించే సాహిత్యాన్ని విహంగ వీక్షగా పరికిద్దాం:

ప్రాచీన భారతీయ వ్యవస్థలో స్త్రీకి అఖండమైన గౌరవ ప్రపత్తులుండేవి. సమాజంలో అత్యున్నత స్థానముండేది. అన్ని రంగాల్లోనూ పురుషునితో సమాన ప్రతిపత్తి కలిగుండేది. ప్రపంచ వాఙ్మయానికే ఆద్యమూ పూజ్యమైన ఋగ్వేదపు ఋక్కులను రచించిన వారిలో వాక్, రాకా, అర్చిష్మతి, మహిష్మతి, సినీవాలి మొదలైన ఋషికలున్నారు, వేదకాలంనాడు స్త్రీకి విద్యావైద్యాలను నేర్పే గురుకులాలుండేవి. అందులో బోధించేవారు స్త్రీలే వుండేవారు. స్త్రీకి పద్దెనిమిది సంవత్సరాలు వచ్చాక తనకు నచ్చిన వరుణ్ణి వివాహం చేసుకునే హక్కుండేది. గృహిణిగా అత్యుదాత్త గౌరవాదరాభిమానాలను చూరగొనేది. ఆస్తి హక్కుండేది. యజ్ఞయాగాది క్రతువులనూ నిర్వర్తించేది. వృత్తివిద్యల నభ్యసించేది.

పతంజలిని యోగభాష్యకారుడిగా తీర్చిదిద్దినది 'గోణికాదేవి' అనే కాశ్మీర దేశపు యోగినీమణి. గౌతముడికన్నా ముందు 'సుబాల' అనే ఆమె న్యాయశాస్త్ర ప్రవీణగా ఖ్యాతి నొందింది. మహాజ్ఞానిగా పేరు పొందిన జనకుని సభలో సత్కారాలనందుకుంది 'సులభ.' గార్గి, మైత్రేయి, ఉభయభారతులు వేదాంత తత్త్వవాదినులుగా కీర్తి నొందినవారు. ఈ విధంగా ఉన్నత స్థానాన్నధిష్ఠించి వుండే 'స్త్రీ' స్మృతులకాలానికి క్రమ క్రమంగా చ్యుతి నొందింది. దీనికి ఒక విధంగా పున్నామనరకం నుండి రక్షించేవాడు పుత్రుడు, 'పుత్రులు లేనివారికి సద్గతులు ప్రాప్తించవు' అనే మతపరమైన విశ్వాసాలు ప్రబలడం కారణం గావచ్చు. తత్కారణంగా స్త్రీ శిశువులపై అనాదరణ కలగడమేకాక స్త్రీ శిశు ఖననాలు కూడా కొన్ని మతాల్లో జరగడం సంభవించింది. విద్యావిత్తాలనుండి స్త్రీ వంచితురాలు కాసాగింది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోల్పోసాగింది. పురుష స్వామ్య వ్యవస్థలో పురుషుడు స్త్రీని తన అదుపులో నుంచుకోవడానికి అనువుగా పురాణగాథలను, ధర్మశాస్త్రాలను, నీతిసూత్రాలను సృజింపనారంభించాడు.

మగవాడి లోపాలన్నింటికీ ఆడదాన్నే హేతువనడం జరిగింది. ఖురాన్, బైబిల్, రామాయణ భాగవతాది అన్ని మత గ్రంథాల్లోను స్త్రీ కేవలం పురుషుడి ఆనందం కోసమే సృష్టింపబడిందనీ, స్త్రీలు వంచకులు, చంచల స్వభావులనీ, స్త్రీ బుద్ధి ప్రళయాంతకమనీ, భర్త యెటువంటి వాడైనా భార్య లొంగివుండ వలసినదేననీ వక్కాణించాయి. మనుస్మృతిలో స్త్రీకి స్వాతంత్ర్యముండరాదనీ జీవితకాలమంతా మగవాడి చాటునే వుండాలనీ, ఆమె దుర్గుణాల ప్రోవనీ, రాజ కార్య యంత్రాంగ స్థలంలో కానీ, పండిత సభల్లో కానీ స్త్రీ వుండరాదనీ నిర్దేశించాడు. స్త్రీ హత్యను ఉపపాతకంగా పేర్కొన్నాడు. ఈ విధంగా మనువు స్త్రీపాలిటి శత్రువుగా పరిణమించాడు.

మధ్యయుగీన వ్యవస్థలో స్త్రీ కేవలం పురుషుడి భోగ్య వస్తువుగాను, ఏమాత్రం వ్యక్తిత్వంలేనిదీ పురుషుని ఛాయామాత్రంగాను భావింపబడింది. ఈ స్థితి నాటి సాహిత్యంలోనూ ప్రతిబింబించింది. సతి పేరిట స్త్రీని సజీవ దహనం గావించే అమానుషచర్యలు ప్రబలాయి. పాతివ్రత్యం పేరిట స్త్రీ వ్యక్తిత్వాన్నీ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనీ బలిగావించే ఆచార సంప్రదాయాలు బలపడ్డాయి.

కాలచక్ర భ్రమణంలో ఒకమారు క్రిందైన చువ్వ మరొకమారు పైకిరాక మానదు. అట్లాగే స్త్రీ స్థితి కూడా ఆధునిక యుగంలో సంఘసంస్కర్తల అవిర్నామకృషికి ఫలితంగా మెరుగు కాజొచ్చింది. సమాజాభ్యుదయానికి జనాభాలో సగభాగమైన స్త్రీ జాత్యుద్ధరణావశ్యకతను గుర్తించిన రాజారామ్మోహనరాయలు, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, స్వామి దయానంద సరస్వతి మొదలైన మహనీయులు స్త్రీ విద్యను, వ్యక్తిత్వ వికాసాన్ని ప్రోత్సహించారు. రాజ్యాంగ రచనా సంఘాధ్యక్షుడు డా. అంబేద్కర్ స్త్రీల స్వేచ్ఛా సమానత్వాలకు బీజావాపం గావించాడు. బ్రహ్మసమాజం సతీసహగమన, బాల్యవివాహ నిషేధ చట్టాలను రూపొందింపచేసింది. విద్యావంతురాలైన స్త్రీ విజ్ఞాన వివేకాలను పొంది తరతరాలుగా కొనసాగుతున్న తన బానిసత్వాన్ని అంగీకరించలేకపోతుంది. అంతగా మారని సాంఘిక వ్యవస్థలో స్త్రీ తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోవటమొక సమస్యలాగా తయారయింది.

బీనామజుందార్ 2.3.89 లో ప్రెస్‌క్లబ్బులో ప్రసంగిస్తూ- భారత రాజ్యాంగంలో స్త్రీలకు సమానత్వాన్ని ప్రతిపాదిస్తూ హక్కుల నిచ్చినప్పటికీ

అవి అనుభవంలోకి రావడం లేదన్నారు. మహిళలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, సామాజిక న్యాయాన్ని అందకుండా చేయాలనే ప్రయత్నాలు సాగుతున్నాయని హెచ్చరించారు. "మన దేశంలో ఛాందస, సనాతన మతతత్త్వాలు ప్రబలమవుతున్నాయి. అవి స్త్రీల అణచివేతనాశిస్తున్నాయి. పురుషాధిపత్య సమాజ విలువలను ముందుతరాల వారికి సంక్రమింపచేసే నిమిత్తం స్త్రీలను తమ అదుపులో పెట్టుకోవాలని ఛాందస మతవర్గాలు ఆలోచిస్తున్నాయి. ఇది చాలా దుర్మార్గం. ఈ ఛాందస వర్గాల దాడిని జిజ్ఞాసువులు, విద్యావంతులు, మహిళలు కృతనిశ్చయంతో ఎదుర్కోవలసున్నదని నొక్కివక్కాణించారు.

స్త్రీ యొక్క లైంగిక ప్రవృత్తినీ ఆమెకున్న సంతానోత్పాదనాశక్తినీ పురుషుడు తన స్వార్థానికి వాడుకుంటున్నాడు. ఆమె మేధాజీవిగా జీవించడానికనువైన పరిస్థితులను కల్పించడంలేదు సరికదా ఆమె నణచివేస్తున్నాడు. స్త్రీ వ్యక్తిత్వ వికాసానికి అడ్డుపడుతున్నాడు. ప్రస్తుత వివాహబంధంలోని నైచ్యస్థితి యీ విధంగా ఉంది. నేటి ఫెమినిజం స్త్రీని వస్తువుగా మార్చే పెట్టుబడిదారీ సమాజాన్ని, పురుషాధిపత్యాన్ని, లైంగికదోపిడీని వ్యతిరేకిస్తోంది. లైంగిక విషయంగా పురుషులు ద్వంద్వ నీతిని అనుసరిస్తున్న తీరుతెన్నులపై స్త్రీవాదులు నిరసనను వ్యక్తీకరిస్తున్నారు.

స్త్రీ స్వేచ్ఛంటే పురుష ద్వేషంకాదనీ, పురుషాధిపత్య నిరసననీ, స్త్రీ వ్యక్తిత్వాన్ని, ప్రతిపత్తినీ కాపాడేదే స్త్రీ స్వేచ్ఛనీ, స్త్రీ యొక్క ప్రతిభా వ్యుత్పత్తులు వికసించే అవకాశం కలుగచేసేదే స్త్రీ స్వేచ్ఛనీ అంటారు ప్రముఖ సంఘసేవాపరాయణురాలు శ్రీమతి మల్లాది సుబ్బమ్మ. 'స్వేచ్ఛ' అనే భావాన్ని రెండు రకాలుగా చెప్పవచ్చు:

1) బంధవిముక్తి 2) ఆనందప్రాప్తి కోసం సాధన. అందాల పోటీల్లు, ఫ్యాషన్ పెరేడ్లు, మోడల్సుగా నుండడం. ప్రేక్షకులకు జుగుప్స, కామోద్రేకం కల్గి తద్వారా ఇతరులకు నష్టం కలిగే రీతిలో భావాలు కలుగచేస్తే అవినీతి అవుతుంది. నింద్యమవుతుంది.

సౌందర్యాన్నయినా శరీరాన్నయినా చివరకు మెదడునయినా ధనార్జన కోసం, పదవికోసం, ప్రచారం కోసం, పేరు ప్రఖ్యాతులకోసం తన యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా తన హోదాకు భంగంగా, తన వ్యక్తిత్వాన్ని కించపరుచుకునేటట్లు, తన వ్యక్తిత్వానికి దెబ్బ తగిలేటట్లు విపణివీధిలో పణంగా

పెడ్తే, వ్యాపార సంస్కృతికి బలయితే అది నింద్యమే నంటారు మల్లాది సుబ్బమ్మగారు.

సాహిత్యం సమాజానికి అద్దంపడుతుంది కనుక, ఆధునిక యుగంలోని తెలుగు సాహిత్యంలో స్త్రీవాదధోరణు లేవిధంగా దీపిస్తున్నాయో పరిశీలిద్దాం. సంఘ సంస్కర్తగా స్త్రీ జనోద్ధరణకై పాటుపడిన కందుకూరి తన రచనలను అందు కుపకరణంగా మలచుకున్నాడు. కన్యాశుల్కోతిప్రవృత్తంతో వ్రాసిన బ్రాహ్మ వివాహము, రాజశేఖర చరిత్ర, హాస్యరచనలు మొదలైనవన్నీ నాటి స్త్రీల దుస్థితిని కళ్ళకు కట్టేటట్టు చేసేవే! 'ఆధునిక మానవేతిహాసం'గా పేర్కొన బడ్తున్న గురజాడ కన్యాశుల్కము, ముత్యాల సరాలలోని ఖండికల్లో పూర్ణమ్మ, కన్యకలు నాటి సమాజంలో స్త్రీలకు జరిగే అన్యాయాన్ని, అక్రమాన్ని దురంతాల నెత్తి చూపేవే! కన్యాశుల్కమేగాక వరకట్నమూ స్త్రీల పాలిట శాపంగానే యెలా పరిణమించిందో రాయప్రోలు వారి 'స్నేహలత' వివరిస్తుంది. రాయప్రోలు వారి ఖండ కావ్యాల్లోని నాయికల్లో చాలామంది పురుషుల స్వార్థానికి గురియైనవారే! (కష్టకమల, రూప నవనీతం మొ॥) కాళ్ళకూరి నారాయణరావు గారు 'వర విక్రయం'లో 'కమల' అనే పాత్రచేత కట్నాలను తీసుకునే వరుళ్ళను-

"వెండి నాణెంబె పెనిమిటి వేశ్యకటులె
కట్నములె భార్య లిప్పటి కర్కశులకు
వేశ్యవెలయా లనంబడె వెలగ్రహించి
కట్నములచేత వెలమగల్ కారెవీరు?" అంటూ తీవ్రంగా విమర్శింపచేస్తారు.

ఈవిధంగా వివాహ వ్యవస్థలోని ఈ రెండు దురాచారాలనూ దుమ్మెత్తిపోస్తారు నాటి కవులు గురజాడ 'కన్యక'లో స్త్రీపై అత్యాచారాని కొడిగట్టిన అధికార మదాంధతను తీవ్రంగా నిరసిస్తారు. తరువాతి భావకవులు స్త్రీని పురుషుని ప్రాణ దాత్రి, హృదయనేత్రిగా భావించి, తమ ప్రణయారాధనాభావాన్ని వ్యక్తం చేశారు. బాహ్యసౌందర్యానికి కాక అంతరసౌందర్యానికి ప్రాధాన్యత నిచ్చారు.

చలం వివాహ వ్యవస్థలో నుండే అస్తవ్యస్తతను తీవ్రంగా నిరసిస్తాడు. వివాహం పవిత్ర ప్రణయంతో పెనవేసుకున్నది కాక కేవలం ఒక సాంఘిక ముద్రగా రూపుదాల్చిందని, ప్రణయోపాసనలేని యీ వ్యవస్థ వ్యర్థమని నిరూపిస్తూ నిరసిస్తాడు. ఇటువంటి వివాహవ్యవస్థవల్ల సౌందర్య సౌశీల్య సహజ వ్యక్తితావి లున్న స్త్రీని ఏ విధంగానూ ఆమెకు సరితూగని పురుషుడు వివాహం పేరుతో

ఆమెను బానిసను గావిస్తున్నాడనీ, ఆనందాని కేమాత్రం ఆస్కారం లేకుండా యాంత్రికంగా తయారైన వ్యవస్థను రూపుమాపవలసిందనీ, సెక్సులో స్వేచ్ఛను కోరతాడు. ఈ దృష్టిలో సమాజంలో స్త్రీల పరిస్థితిని విమర్శిస్తూ స్త్రీ, వివాహం, సావిత్రి, మైదానం వంటి రచనలను చేసాడు చలం. పై రచన లన్నింటిలోనూ స్పష్టాస్పష్టంగా స్త్రీవాద భావాలు భాసిస్తున్నాయి. అయితే మనం అంతర్జాతీయ మహిళాసంస్థ స్థాపనానంతరం 1975 - 85 వత్సరాలను మహిళా దశాబ్దంగా ప్రకటించిన తర్వాత కలిగిన చైతన్య స్ఫూర్తితో, జాతీయ - అంతర్జాతీయ స్త్రీవాద ప్రభావంతో వచ్చిన సాహిత్యాన్నే స్త్రీవాద సాహిత్యంగా పరిగణిస్తున్నాము.

విద్యావంతులైన తెలుగు మహిళలు అన్ని రంగాల్లోనూ ముఖ్యంగా సాంఘిక రంగంలో పురుషాహంకారం స్త్రీల నెలా అణగద్రొక్కుతుందో గమనించ నారంభించారు. సమాజంలోని మానవులను ఆడా మగా అనే రెండు వర్గాలుగా విభజించి పురుషులు స్త్రీలపై యెన్నెన్ని అత్యాచారాలను చేస్తున్నారో స్త్రీ యెంతగా అన్యాయానికి గురి అవుతుందో, దాన్ని భరించలేని స్త్రీ ఆత్మహత్యకు పాల్పడడం జరుగుతోందని, ఆర్థిక వ్యత్యాసం, స్త్రీకి తన కాళ్ళపై తాను నిలబడటానికి అవకాశం లేకపోవడంవల్ల పురుషునిపై ఆధారపడి జీవించడం వల్ల దళితవర్గానికే చెందుతోందనీ, న్యాయశాస్త్రపరంగా తనకు జరుగుతున్న అన్యాయాన్నెదుర్కోలేక, దాన్ని భరించలేని స్త్రీ ఆత్మహత్యకు పాల్పడుతోందనీ, పురుషుల స్వార్థపరత్వ మంతకంతకీ పెరిగిపోతూండడంతో స్త్రీని అన్నిరకాలుగానూ తన సుఖసంతోషాలకోసమే ఉపయోగించుకోవడం, వరకట్నపు చావులు, విద్యా - ఉద్యోగావకాశాలు స్త్రీలకు కలిగినప్పటికీ వాటివల్ల మరోరకమైన సమస్యలు తలెత్తడంవల్ల స్త్రీపడే మానసిక వ్యధల గాథలు, ఎమినో సెంటసిస్‌వంటి శాస్త్ర విజ్ఞానాభివృద్ధి కూడ స్త్రీలకు వినాశహేతువుగానే పరిణమించడం (స్కానింగ్‌వల్ల స్త్రీ శిశువని తెలియగానే అబార్షనుకు యత్నించడం)— వీటన్నిటి నేపథ్యంలో నేటి స్త్రీవాద సాహిత్యం అనంతమైన వైవిధ్యంతో వెలువడుతోంది. కవిత, నవల, కథానిక, స్వీయచరిత్ర, విమర్శ, వ్యాసం మొదలైన విభిన్న సాహిత్య ప్రక్రియల్లో స్త్రీవాద విభిన్న ధోరణులు వెలువడుతున్నాయి. తెలుగు సాహిత్య జగత్తులో తమ ప్రత్యేకతను నిరూపిస్తున్నాయి.

ముప్పాళ్ళ రంగనాయకమ్మగారి జానకి విముక్తి, స్త్రీ, పేకమేడలు; ఓల్గా స్వేచ్ఛ, మానవి మొదలైన నవలలు; కొండేపూడి నిర్మల 'సందిగ్ధ సంధ్య',

నడిచే గాయాలు; జయ ప్రభ 'వామనుడి మూడోపాదం', 'యుద్ధోన్ముఖంగా', 'ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిది'; మందరపు హైమవతి 'సూర్యుడు తప్పిపోయాడు' మొదలైన కవితా సంపుటులు; మల్లాది సుబ్బమ్మగారి 'పాతివ్రత్యంనుండి ఫెమినిజందాకా' అన్న స్వీయ చరిత్ర; విమల, సావిత్రి, అబ్బూరి ఛాయాదేవి, కొండపల్లి కోటేశ్వరమ్మ, వసంతా కన్నాబిరాన్, కె. గీత, శిలాలోలిత, వాణీ రంగారావు మొదలైన వారి కవితలు; 'అన్వేషి', అస్మిత సంస్థలు వెలువరించే వ్యాసాలు స్త్రీ స్వేచ్ఛ మొదలైన పత్రికలు స్త్రీ వాదంలోని విభిన్న ధోరణుల నింపొందించుకున్నవి.

స్త్రీవాద రచనలు చేసేవారిలో అధికశాతం స్త్రీలే అయినప్పటికి మగవారు కూడా కొంతమంది వున్నారు. వారిలో మొదట శ్రీశ్రీని చెప్పుకోవాలి. 1989 ఫిబ్రవరిలో ప్రజాసాహితి మాసపత్రికలో "కదలిరండి నవభారత నారీమణులారా!" అన్న కవితలో వరకట్న పిశాచి నణచడానికీ ఆర్థిక అసమానతల కుళ్ళగించి పెళ్ళగించి కొత్త బాట వేయడానికీ, ఆడది మగవాని చేతి ఆట వస్తువు అని యెంచే పాత భావాలను లోతుగా పాతర వేయడానికి కదలిరమ్మంటాడు. కిశోర్, అల్లం నారాయణ, తంగిరాల, శివారెడ్డి మొదలైనవారి కవితలు స్త్రీవాద భావాలతో కూడినట్టివి.

విభిన్న సాహిత్య ప్రక్రియల్లో వచ్చిన స్త్రీవాద ధోరణులపైని డా. కాత్యాయనీవిద్మహే, లావణ్య సరస్వతి, శ్రీమతి కె. బి. లక్ష్మిగారలు ఈ సదస్సులో తమ పత్రాలను సమర్పిస్తారు కనుక వాటి విశ్లేషణకు పూనుకోవడం లేదు. నా ప్రసంగం ముగించే ముందు మరొకమారు-స్త్రీవాదం పురుషాహంకారం, అధికృతలపైన తిరుగుబాటు చేస్తుంది కానీ పురుషద్వేషంకాదనీ, సమాజంలో సగభాగమై తమకు జన్మ నిచ్చి పెంచినవారినే మిగిలిన సగభాగం పురుషులు విభజించి పాలించే తీరుపైన, నేటి వివాహ వ్యవస్థలోనున్న అస్తవ్యస్తతపైన తిరుగుబాటనీ, సమగ్ర దేశాభ్యుదయాన్ని సాధించాలంటే అందులో సగభాగమైన స్త్రీ జనాభ్యున్నతి జరిగి తీరాలనీ స్త్రీ బాహ్యాంతర బంధనాల నుండి విముక్తిని పొందడానికై చేసే ఉద్యమమిదనీ, పురుషుడితోపాటు స్త్రీకి అన్ని రంగాల్లో సమానత్వం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సాధించడమే స్త్రీవాదుల లక్ష్యం- అదే వారి గమ్యం అనే విషయాన్ని సభా సదులకు విన్నవిస్తూ, తత్సాధనలో అందరూ సహకరించవలసినదిగా కోరుతున్నాను. నాకీ అవకాశం కల్పించిన యువభారతి కార్యవర్గానికి నా ధన్యవాదాలు.

# పెళ్ళి - కుటుంబం

—కె. అరుణకుమారి

సర్వం సహా సృష్టిలో సకల ప్రాణులకీ ఆకలీ, నిద్రా, దైహిక వాంఛా సమానమైన గుణాలే. మనిషి బుద్ధిజీవి కాబట్టి "నియతకృతి నియమరహిత" మైన కామాన్ని క్రమబద్ధమూ, సంఘబద్ధమూ చేయటానికి ఒక వ్యవస్థ కల్పించాడు. ఈ వ్యవస్థలో తనకీ, తన జీవితాన్ని పంచుకునే ఆడదానికీ హోదాలు కూడా కల్పించాడు. ఈ వ్యవస్థ పేరే పెళ్ళి. ఈ హోదాలే మొగుళ్ళూ, పెళ్ళాలు. (భర్త అంటే సంసార బాధ్యతలు భరించేవాడనే అనుకోండి. కానీ 'భర్త' అనే పదంలో "ఇలాంటి భార్యను భరిస్తున్నాను" అనే ధ్వని వినిపిస్తోంది. మొగుడే బాగుంది గొడుగులాగ; పెళ్ళామే బాగుంది హారతి పళ్ళెంలాగ.)

చరిత్ర పేజీలు వొక్కసారి తిప్పుతూంటే కొన్ని సమాజాలలో సమష్టి జీవితంలోంచి వ్యష్టి జీవితంలోకి మనిషి సాగించిన ప్రయాణంలో 'మాతృస్వామ్య' వ్యవస్థ కనిపిస్తోంది తండ్రే తెలియని ఈ జీవన విధానంలో తల్లి అన్నో, తమ్ముడో ఆవిడ పిల్లల బాధ్యతని తీసుకుంటాడు. (చరిత్రలో కనిపించే మేనమామల అనురాగాలూ, ఆగడాలూ ఈ వ్యవస్థ ఛాయలే!) మన దేశంలోనూ మాతృస్వామ్యం లేకపోలేదు. ("మహాభారతంలో" ద్రౌపదీ, పిల్లల్ని కన్నా కన్యాత్వం చెడకుండా వరం పొందిన మాధవీ, మాతృస్వామ్యపు అవశేషాలే మరి!) అందుకేనేమో "తల్లి నిజం, తండ్రి భావనే" (Mother is a fact, father is an opinion) అన్న మాట పుట్టింది. భారతదేశంలో కనిపించే స్త్రీదేవతారాధన' దీనికొక మచ్చుతునక. ఈ మాతృసామ్య వ్యవవస్థలో పెళ్ళి మాట వినపడదు.

తను పోయాక తన జీవితాన్ని తన పిల్లలు కొనసాగించాలన్న బలీయమైన కోరిక పుట్టింది మగవాడికి. ఈ కోరికే పితృస్వామ్య వ్యవస్థగా రూపు దాల్చింది. పిల్లలు అతని పేరుతో చలామణీ కావడం అతని అహాన్ని ఎగదో

సింది. తిండి సంపాదనలో శ్రమని పంచుకోడానికి తోడవసరమై పెళ్ళి ఆర్థిక సంబంధ వ్యవస్థగా అవతారమెత్తింది. పెళ్ళాం, పిల్లలూ శ్రమను పంచుకోడంతో ఉత్పత్తి పెరుగుతూ బహు భార్యాత్వానికి దారితీసింది. పెళ్ళాం చాకిరికి బాగా పనికొచ్చింది. "కార్యేషుదాసీ" అయ్యింది. మొగుడు 'దొర'- పెళ్ళాం బానిస. పెళ్ళాం వంటింటికీ, పురుటి గదికీ మధ్య నిస్తేజంగా, నిర్వికారంగా తిరుగే మకిలి పట్టిన గానుగ యంత్రం అయ్యింది.

భారతీయుల కాలమానం ప్రకారం మనిషి జీవితం నూరేళ్ళు. (పాశ్చాత్యులకి three score and ten - అంటే డెబ్భై ఏళ్ళే) మనిషి సంఘజీవి కాబట్టీ, సంఘానికి అతను జవాబుదారీ కాబట్టీ సాంఘిక ధర్మాలనీ, ఆచారాలనీ పరిపుష్టి చేసేందుకూ, సగటు మనిషి జీవితాన్ని ఆనందమయం చేసేందుకూ ఆశ్రమ ధర్మాలను ఏర్పరిచారు వైదిక ఋషులు. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్యాసం— ఈ నాలుగూ ఆశ్రమ ధర్మాలు. ఈ నాలుగింటిలో గార్హస్థ్యం ప్రశస్తమయింది. ఎందుకంటే - ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలకీ ఈ గృహస్థ జీవితమే సానుకూలమయింది కనుక. ఒక్కొక్క ఆశ్రమ ధర్మానికి 25 ఏళ్ళు వెరసి 100 ఏళ్ళు కేటాయించారు మన ఋషులు. పెళ్ళిని 'ధర్మ', (అన్ని ధర్మాలూ), "ప్రజా" (సంతానం), 'కామం' (లైంగిక సాంగత్యం)లను ఒనగూర్చే క్రతువుగా, కర్తవ్యంగా, ముచ్చటగా భావించారు మన ఋషులు.

పెళ్ళి 'పెణ్ఇల్' (ఆడపిల్ల ఇల్లు) నుంచీ వచ్చిందట. అదే 'పెండిర్', 'పెండ్లి'గా మారిందిట. ఇంకా పెళ్ళికి చాలా పేర్లే ఉన్నాయి. 'వివాహము' లేదా 'ఉద్వాహమ్'-అంటే విశిష్టమైన గృహస్థ ధర్మాల బాధ్యతలని వహించడం అన్నమాట. 'పాణిగ్రహణము' అంటే పెళ్ళికొడుకు పెళ్ళికూతురు చేతిని పట్టుకొని 'ధర్మేచ, అర్థేచ, కామేచ - నాతిచరామి' (ధర్మంలోనూ, విత్తసంపాదనలోనూ, దైహిక వాంఛలోనూ నిన్ను విడచివెళ్ళను) అని ప్రమాణం చేస్తాడు. పాణిగ్రహణమయ్యాక యజ్ఞవాటిక చుట్టూతా మూడుసార్లు చేసే ప్రదక్షిణాన్ని 'పరిణయము' అంటారు. ఇదయ్యాక పెళ్ళికూతురు 'పరిణత' అవుతుంది. పెళ్ళి శుభకార్యం కాబట్టి 'కల్యాణ'మన్నారు.

సప్తపదిలో - పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ కలసి ఏడడుగులు వేస్తారు. "సాప్తపదీనం సఖ్యం" - ఏడడుగులతో స్నేహం కలుగుతోంది - సఖాసఖూలూ ప్రాణస్నేహితులు అన్నమాట. మొదటి అడుగు భుక్తికోసం (ఇష); రెండవది - శక్తికోసం (ఊర్జ); మూడవది ఐశ్వర్యం (రయి); నాల్గవది ఆనంద మధుజీవనం (మయోభవ); ఐదు ఉత్తమ సంతానం (ప్రజా); ఆరు దేశకాలానుగుణ ప్రవర్తన (ఋతు); ఏడు - సఖ్యము (సఖ్యం). ఏడో అడుగుతో వధువుని వరుడు 'సఖే' అని సంబోధిస్తాడు. ఈ అపురూపమైన ముచ్చటకంతా అగ్ని సాక్షీభూతుడు. అగ్ని కాల్చేసే గుణంతో పునీతుడవటమే కాదు దీనికి కారణం, దైనందిన జీవితంలో నిప్పుకున్న ప్రాముఖ్యతను గుర్తించి అగ్నిసాక్షి వివాహాన్ని విధిగా నిర్ణయించారు. (ఋగ్వేదం "అగ్నిమీడే పురోహితమ్" అనే ఋక్కుతోనే మొదలవుతుంది. చరిత్రలో ఆదిమానవుడు నిప్పుని పుట్టించడం, దాంతో అతని అభ్యుదయాన్ని మనం గుర్తుకు తెచ్చుకోవాలి.)

బాల్య వివాహాలు వైదిక వివాహాలలో లేవు. మొగ్గలా వున్న బాల' పువ్వులా వికసించిన ముగ్ధ అయితేనే శారీరక, మానసిక పరిణతి కనిపిస్తుందని వైదిక ఋషుల అమూల్యమైన నమ్మకం. అందుకే రజస్వలానంతరమే ఆడపిల్లకి పెళ్ళి చేసేవారు. పెళ్ళికొడుకు పెళ్ళయ్యాక పెళ్ళాన్ని 'రాకే' అని పిలుస్తాడు. 'రాక' అంటే రజస్వల అయిన స్త్రీ. పెళ్ళాంగా ఆడదానికి మూడు రకాల పేర్లున్నాయి. పత్ని అంటే మొగుడు చేసే క్రతువుల్లో పాలుపంచుకునేది. జాని అంటే పిల్లల తల్లి. జయ అంటే భర్తకిష్టమైన స్త్రీ. షోడశ దానాలలో కన్యా దానం ఒకటి; ఉత్తమోత్తమ దానంకూడా. ఆడపిల్ల 'చిత్' స్వరూపిణి ఐన 'పరాదేవతా' అవతారం - అందుకే ఆడపిల్ల ఇంటికి - శ్రీకారమూ, శుభకరమూ, సురుచిర శోభాకరమూ చేకూర్చే లక్ష్మి. అందుకే "చల్ల సంగరం, కన్నె సంగరమూ ఎప్పుడూ వుంచుకోవాలి" అనే సామెత పుట్టింది. కన్యాదానంతో ఇటూ అటూ తరాలు తరిస్తాయనే తియ్యని, గట్టి నమ్మకం. మాంగల్యాన్ని కడుతూ (తాతాజీ మంగళ సూత్రాన్ని "గళ సూత్రం" గానూ, 'పసుపుతాటి'ని 'పలుపుతాడుగా'నూ వెక్కిరించారు కాదూ!) పెళ్ళికొడుకు పెళ్ళికూతురితో "మాంగల్య తంతునానేన మమ జీవన హేతునా కంఠేబధ్నామి శుభగే, త్వం జీవ శరదః శతమ్"అంటాడు. (ఓ కల్యాణీ! నా జీవనహేతువైన మాంగల్యాన్ని నీ కంఠానికి కడుతున్నాను నూరు శరత్తులు జీవించు.) అందుకే పెళ్ళి నూరేళ్ళ పంటయ్యింది. రెండు నిండు

జీవితాలని బంధించి, మొగుడూ పెళ్ళాల అభేదత్వాన్ని చూపిస్తూ, వంశాన్ని పెంచుతూ, అనురాగాన్ని పంచే తియ్యని ముచ్చట. Marriage is the best **and the most important relation that can exist between two human beings** (Russel )

మనం దేవుళ్ళకే పెళ్ళిళ్ళెన్నో చేశాం. సీతమ్మని పెళ్ళికూతుర్ని చేసి, రామయ్యని పెళ్ళికొడుకుని చేసి, ఆకాశమంతా పందిరి, భూదేవంత అరుగువేసి, ముత్యాల తలంబ్రాలు పోయించాం. బహు భార్యాత్వం వైరితలలూ వేస్తూ, విచ్చల విడితనం అరాచకం పెచ్చుమీరుతున్న సమాజంలో నుంచి పుట్టించాడు వాల్మీకి రామయ్యనీ, సీతమ్మనీ. రామయ్య ఏకపత్నీత్వానికీ, సీతమ్మ సచ్ఛీల, పాతి వ్రత్యాలకి ప్రతీకలై 'యావత్ స్థాస్యంతి గిరయః, సరితః మహీతలే" (పుడమి తల్లి మీద గిరులు, ఝరులూ ఉంటున్నంతవరకూ) ఆదర్శ ప్రాయులైన మొగుడూ పెళ్ళాలుగా, పూజింపబడుతూనే ఉన్నారు. అర్ధనారీశ్వరుని "జగత్పి తరులు" పార్వతీ పరమేశ్వరులు మొగుడూ పెళ్ళాల సమత్వాన్ని చూపిస్తున్నారు. విష్ణువు లక్ష్మిని గుండెల్లో దాచుకోవటం సులలిత, సుమనోహర, సుందర దాంప త్యానికి ప్రతీక. పైగా లక్ష్మీ విష్ణువులు సీతారాములుగా, రుక్మిణీ కృష్ణులుగా అవతారా లెత్తడం - మొగుడు పెళ్ళాల బంధం జన్మ, జన్మలదన్న పటుత్వాన్ని సంతరించుకొంది. (life - long monogemy is best when it is possible - Russell).

మన శాస్త్రకారులు ఎనిమిది రకాల పెళ్ళిళ్ళ గురించి చెప్పారు:

1. **బ్రాహ్మము:-** కన్యాదాత పెళ్ళి కూతురిని, మంచి ప్రవర్తనా వ్యక్తిత్వం వున్న పిల్లవాడికిచ్చి పెళ్ళి చెయ్యడం.
2. **దైవము :-** కన్యాదాత, యజ్ఞం చేస్తున్న ఋత్విక్కుడికి సాలంకృత అయిన కన్య నిచ్చి పెళ్ళి చెయ్యడం.
3. **ఆర్షము :-** పెళ్ళికొడుకు నుంచీ ఒక ఎద్దునీ ఆవునీ తీసుకొని కన్య నిచ్చి పెళ్ళి చెయ్యటం.
4. **ప్రాజాపత్యము :-** యజ్ఞ వేదిక (పెళ్ళి మంటపం) మీద పెళ్ళి కూతురినీ పెళ్ళి కొడుకునీ కూర్చోబెట్టి "మీరిద్దరూ గృహస్థ ధర్మాలను నిర్వర్తిం చండి" అని చెప్పి పెళ్ళి చెయ్యడం.

5. **అసురము :-** పెళ్ళికొడుకు దగ్గరనుంచీ డబ్బు తీసుకొని (కన్యా శుల్కము) పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యడం.
6. **గాంధర్వము :-** ప్రేమించి, పెద్దల అనుమతిలేకుండా చేసికొనే పెళ్ళి.
7. **రాక్షసము :-** పిల్ల బంధువులతో పోట్లాడి బలాత్కారంగా కన్య నెత్తుకు పోవడం.
8. **పైశాచికము :-** నిద్రలోనూ, మత్తులోనూ ఉన్న పిల్లని బలాత్కరించి పెళ్ళి చేసుకోవడం.

పై పెళ్ళిళ్ళలో ఒకటి రెండు తప్ప అన్నీ ఆచరణ యోగ్యం కావు. ఇంక ఆధునిక వివాహాలను గురించి చూద్దాం:

**1955 లో** హైందవ వివాహ చట్టం అమలులోనికి వచ్చింది. దీని ప్రకారం పెళ్ళి జరిగేనాటికి అమ్మాయి వయస్సు 18 సం॥లు, అబ్బాయి వయస్సు 21 సం॥లు ఉండాలి. కుల, మత, ప్రాంత, వర్గభేదాలులేని పెళ్ళి ఇది. ముగ్గురు పరిణత సాక్షులముందు ఇరువైపుల వారూ ప్రమాణాలు చెయ్యాలి. తర్వాత register లో ఇద్దరూ సంతకాలు చెయ్యాలి. దీన్నే Registered Marriage అంటున్నాం.

**సంస్కరణ వివాహం :** సంప్రదాయాన్ని తోసిరాజని ఆధునిక పరిస్థితుల కనుగుణంగా చేసే పెళ్ళి (Reformative marriage).

**ఆదర్శ వివాహంలో** పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ పూలదండలని మార్చుకుంటారు. పెళ్ళిప్రమాణాలు అందరికీ అర్థమయ్యే భాషలో ఉంటాయి. మంగళసూత్రధారణ ఉండదు. మంచిరోజులూ, ముహూర్తాలూ ఉండవు. పెళ్ళి విందుల పేరుతో అట్టహాసాలూ, ఆర్భాటాలు ఉండవు. కొండచరియల్లోనో, సముద్రపుటొడ్డుపైనో ఈ పెళ్ళిళ్ళు జరుగుతాయి- మనిషికీ, ప్రకృతికీ వున్న బంధాన్ని బలపరుస్తూ (Idial Marriage).

**విప్లవ వివాహం :-** ప్రేమికులు కలిసి జీవిస్తారు. పెద్దల సమక్షంలో, ప్రమాణాలతో (ఆదర్శ, registered, వివాహాలలాగా) పెళ్ళి చేసుకోరు. ఏ తతంగమూ ఉండదు. పిల్లకిగానీ, పిల్లాడికిగానీ కొన్నాళ్ళ తర్వాత అభిప్రాయ

భేదాలొస్తే విడిపోతారు. కోర్టులకెక్కరు, అవసరం లేదు- పెళ్ళి అంటూ ప్రత్యేక ఏర్పాట్లు జరగలేదు కనుక.

పైన చెప్పిన ఆధునిక వివాహాలలో ఏవి ఆచరణ యోగ్యమైనవని ఆలోచనా పరులంతా ఆలోచించవలసిందే!

పెళ్ళాం అర్ధాంగిగా ఇంట్లో తల మానికంగా ఉండేది. క్రమేపీ ఆవిడ స్థానం భార్యగా భావించబడుతూ 'జాయ'గా (పిల్లలని కనేదిగా) చాయగా మారి పోయింది. విదేశీదాడులు ఆడదాని దుస్తర స్థితికి రంగులు పులిమాయి. ఆడ పిల్ల బాలగానే, రజస్వల కాకుండానే పెళ్ళికూతురయ్యింది. (అష్టవర్షాత్ భవేత్ కన్యా.) ఇంటా, బయటకూడా ఆడదానికి ఆంక్షలూ, నియమాలూ, హద్దులూ, అవరోధాలు, కట్టుబాట్లు ఎక్కువై "ఇనుప కచ్చడాల్" బిగుసుకున్నాయి. బ్రహ్మ వాదినిగా (గార్గి, మైత్రేయి మొ॥) విద్యాంసురాలిగా (ఉభయ భారతి, అవంతీ సుందరి మొ॥) చరిత్రలో వాసికెక్కిన ఆడది కళలకీ, శాస్త్రాలకీ, మానసిక చైతన్యాన్ని మెరుగుపెట్టే ప్రక్రియలన్నిటికీ దూరమయింది. ఆడది మగాడి విలాస వస్తువయింది. అతని అవసరాలు తీర్చే మరబొమ్మయింది. ఆవిడ బల హీనతే ఆవిడలోని ప్రత్యేక లక్షణంగా తయారైంది. ఏడుమల్లెల ఎత్తుతూగే యువతి అస్తినాస్తి విచికిత్సా హేతుశాతోదరీ, అని పిలిపించుకోవడం పరిపాట యింది. ఆవిడ అందాన్ని ఖండాలుగా చేసే అంగాంగవర్ణన ఎక్కువైంది. ఆడ వాళ్ళంతా చంద్రముఖులే, సరసీరుహాక్షలే, పాటలాధరలే, మందయానలే. మగవాడి పాదాల చెంత పెళ్ళాం చోటు. ఆడది నాలుగు గోడల మధ్యే కాలం వెళ్ళబుచ్చుతూ ఎండకన్నెరగని "అసూర్యంపశ్య" అయింది. పతియే ప్రత్యక్ష దైవమంటూ మొగుడి పూజలూ, మొగుడికోసం పూజలూ మొదలయ్యాయి. ఆడ దాని అస్తిత్వం, జీవనం, సౌభాగ్యం మొగుడితో ముడి పడిపోయింది. పెళ్ళాం, మొగుడి కనుసన్నలలోని ఆజ్ఞలు పాటించే బానిసయ్యింది. శయనేషు రంభైన పెళ్ళాం పరాయి మగాడికి అనాకారిగానే ఉండాలి. లేకపోతే "భార్యా రూపవతీ శత్రుః"కదామరి! మొగుడు పరాయి ఊరుకెళ్తే పెళ్ళాం ఇలా ఉండాలి- "అలకలు దువ్వరాదు. సరసాన్నములన్ భుజియింపరాదు, మైకలపములంద రాదు, తిలకంబు రకంబుగ దిద్దరాదు."

ఇంతకీ మొగుడు చచ్చిపోతే సతీసహగమనం- ఎర్రగా భగభగమండే చితిమీద - పెళ్ళాం కూడా దూకి చచ్చిపోవాలట. అలా చస్తే పాపాత్ముడైన మొగుడు కూడా ఈవిధ సతీత్వ మహిమతో పుణ్యలోకాలు పొంది ఈ పెళ్ళాం తోనే నాలుగు కాలాలపాటు సుఖంగా ఉంటాడట!

"చిచ్చురుక బోవు వికచ రాజీవనేత్ర
కశ్వమేధ ఫలమ్ము తథ్యంబు గలుగు" (కాశీఖండం - శ్రీనాథుడ

సతి దురాచారమై అంటూవ్యాధిలా వ్యాపించింది.

సాంఘికంగానే కాక, ఆర్థికంగా కూడా ఆడదానికి మొగుడి అండా, ఆసరా తప్పనిసరైంది. కూడూ, గుడ్డా, కొంపా మొగుడివ్వాలి కదా, పైగా సంఘంలో మర్యాదకీ, ముసలితనంలో ఆసరాకి, కోడళ్ళపై పెత్తనానికి, పిల్లలని ఆ మొగుడితోనే కనాలికదా! ఇలాంటి మొగుడూ పెళ్ళాల మధ్య ఆత్మీయతా, ఆప్యాయతా నశించి, ఆకర్షణ కరిగిపోయి, మానసిక సాన్నిహిత్యం అసలే లేక, శారీరక సంబంధం కూడా పిల్లలకోసం కావటంతో పెళ్ళి ముచ్చటగా కాక, ధార్మిక క్రతువుగా కాక, మతపర ఆంక్షగా ఆడదాని కంఠం చుట్టూ బిగుసుకొంది. ఇలాంటి పెళ్ళి వ్యభిచారంకంటే నికృష్టమని చలం గగ్గోలు పెట్టారిందుకే.

మొగుడు పోయిన ఆడది, 'సతి' చేయని ఆడది వితంతువు, విధవ అవుతోంది. ఆమెకున్న నగలూ, అలంకారాలు తీసేసి, గుండు గీయించి, తెల్ల చీర కట్టించి బతికి వున్న ప్రేతంలా తయారుచేశారు మనవాళ్ళు. ఒంటిపూట భోజనంతో కృంగి, కృశించి చావు నాహ్వానిస్తూ బతకాలావిడ. ఆవిడ రూపే అశుభానికి చిహ్నం.

"బైసిమాలిన పరమ నిర్భాగ్యురాలు
విధవ, దాని యాశీస్సు విషసమంబు" (కాశీఖండం -శ్రీనాథుడు)

''పతిఁబాసి వితంతుత నొందినట్టి రాజీవదళాయతాక్షి యశుచిత్వము సహస్ర ఘటంబుల అవభృదాభిషేక మాచరించినను తీరదు." ఇలా ఆడదాని రూపరేఖలే మార్చేసి, అశుచిత్వాన్ని అంటకట్టడం మగాడి మితిమీరిన దౌర్జన్యానికి పరాకాష్ఠ.

ఆడదానికి పెళ్ళాంగా కంటే తల్లిగా కాస్త మెరుగైన హోదా ఉండేది. పుష్పించే మొక్కా, ఫలించే చెట్టూ, పిల్లలు కనే తల్లీ- లోకంలోనే సుందరమైనవీ, అమూల్యమైనవీ. తల్లికున్న విలువని తెలిసే ఉపనిషద్వాణి "మాతృదేవో భవ" అని ఘోషించింది. తల్లిలో జీవం పోసుకొని, తల్లి నుండి తిండీ, ఊపిరి తీసుకుంటూ, తల్లిలో ఒదిగి, తల్లి ద్వారానే బయటి ప్రపంచానికి తన అస్తిత్వాన్ని చాటుతోంది పిల్ల. తల్లీ, పిల్లల అనుబంధం మంత్రసాని కోసే బొడ్డుతో తెగేది కాదు మరి. అందుకే తల్లికి పిల్లెప్పుడూ "తినరాని పండుపుట్టె, తీపితీపి." పుడమి తల్లీ, ఆడదీ సృష్టికర్తలే.

"పుడమితల్లికి పురిటినొప్పులు
కొత్తసృష్టిని స్ఫురింపించాయ్."

సృష్టినీ, మానవ మనుగడనే నిరవధికంగా కొనసాగేటట్లు చేసే అపర బ్రహ్మ ఆడది. ఒకప్పుడు (అధిక జనాభా సమస్య -Population explosion లేనప్పుడు) సంతానం సౌభాగ్యమే. బహు కుటుంబీకులకి మన్ననా, మర్యాదా ఉండేది. పిల్లలు కనే ఆడదానికి 'సంతానవతి'గా గౌరవమే తప్ప 'పిల్లల కోడి"గా వెక్కిరింతలులేవు. సంతానం కోసం చెట్టూ, పుట్టా, గుట్టా మొక్కడం, తీర్థయాత్రలు చేయడం, మహిమాన్వితులని సేవించడం, పవిత్ర నదులలో మునగడం, పవిత్ర క్షేత్రాలు సందర్శించడం మన సంస్కృతిలోని విశిష్టాంశాలు. సంతానాభిలాష అంత తీవ్రరూపంలో ఉండేదన్నమాట! పిల్లలులేని స్త్రీగా ఉండటం సృష్టిలోనే అసహజమూ, అసంబద్ధమూ. భర్త అసమర్థుడైనా, రోగగ్రస్థుడైనా, ఆపద్ధర్మంగా నియోగ పద్ధతిని పిల్లలని కనవచ్చని అనుమతించాయి మన శాస్త్రాలు. "Pregnancy is a must for a woman for her optimum development" అంటారు Dr. Alexi Carrol (నోబెల్ బహుమతి గ్రహీత).

"భ్రాతారో మానవాస్సర్వే", "వసుధైక కుటుంబమ్" అని మనం ప్రపంచాన్నో కుటుంబంగా, మనుషులంతా అన్నదమ్ములుగా వ్యక్తీకరించుకొంటున్నాం. మనం బ్రహ్మ దేవుడి సంతానం కదా! "కమల గర్భుడు సృష్టికర్త తనూజుడై బహు కుటుంబికుడన్న, బలిమితెచ్చె". పిల్లలతో మొగుడూ, పెళ్ళాల జీవితాలు కాంతివంతమవుతాయి. ఏళ్ళ జీవనవిధానంలో నిండుతనం కనిపిస్తుంది. పిల్లలులేని వాళ్ళ జీవితంలో భర్తీ చేయలేని ఖాళీ ఏర్పడి, ఎందు

దనం తొంగిచూస్తుంది. తల్లిదండ్రుల ప్రేమలో, తండ్రి పర్యవేక్షణలో, తల్లి గారాబంతో పిల్లలు ఆరోగ్యంగా పెరుగుతారు. కుటుంబంతో వీళ్ళకి అనుబంధం ముప్పేటగా ముడిపడుతుంది.

"మాతా పూర్వ రూపం, పితోత్తర రూపం
ప్రజాస్సంధి: ప్రజననగ్ం సంధానం."

అమ్మా నాన్నలు నాణానికి రెండు వైపుల మూర్తులు. పిల్లలూ బంధమూ గర్భధారణ బంధన క్రియా. ఇలాంటి హాయిగా ఉన్న కుటుంబాన్నే **"a giant shock absorber"** అన్నారు.

ఆడదానికి అందరి పెత్తనాలు ఎక్కువైతే, ఆ అక్కసు ప్రకోపించాలి కదా! అత్తామామా, ఆడపడచులూ, బావలూ, మరదులూ అంతా టోకున పెత్తం దార్లే మరీ. అణచుకొన్న అక్కసు పొరలుగా, తెరలుగా పేరుకుపోతుందా ఎదలో. బాలగా, ముగ్ధగా ఆశతో, ఆనందంతో, ఆర్తితో అత్తవారింట అడుగు పెడుతుంది. ఆ ఆనందం బుగ్గై, ఆశలు మొగ్గలుగానే వాడి, ఆర్తి - ఆర్తనాద మవుతూంటే, రోజులు గుదిబండలా బరువుగా దొర్లుతూంటే, ఈ గానుగెద్దు జీవితంలో ఆశాకిరణం ఆవిడ కొడుకే. ఆడపిల్లలు "ఆద" పిల్లలుకదా! ఆడ పిల్లని "దుహిత" అన్నారు. అంటే దూరంగా ఉండి హితం కోరేది. అత్త వారింటి కెళ్ళిపోతారు. దాచుకొన్న ఆక్రోశం జమిలిగా కట్టలు తెంచుకొని తన కోడలి జీవితాన్ని ముంచేస్తోంది. అత్తగారి పాత్రలో ఆవిడలోని మార్దవం, లాలిత్యం ఆవిరై, గయ్యాళితనం ఆవహిస్తుంది. అందుకే "అత్త మంచితనం, కత్తి మెత్తదనం" ఉండవనే సామెత పుట్టింది. చైనా, భారతదేశాలలో **Persecuting mothers-in-law** గయ్యాళి అత్తలూ - ఆత్మహత్యలు చేసు కొనే కోడళ్ళూ వుండటానికి కారణాలివే

చదువుకొని, ఉద్యోగం చేస్తూ, ఆలోచించడం నేర్చుకున్న ఆడది ఈ దౌర్జన్యాన్ని ప్రతిఘటిస్తోంది. తన దీన, హీన పరిస్థితికి పెళ్ళి, కుటుంబాలే కారణాలనుకుంటోంది. పెళ్ళి, పిల్లలు తన స్వాతంత్ర్యానికీ, వ్యక్తిత్వ నిరూప ణకీ, మానసిక చైతన్యానికి ఆటంకాలుగా, అవరోధాలుగా భావిస్తోంది. ఈ కట్టు బాట్ల పంజరంలోంచి "విముక్త"గా ఎగిరిపోవాలనుకుంటోంది.

ఉద్యోగం చేసుకుంటూ పెళ్ళి చేసుకొని, పిల్లలు కనే తల్లులకి వేరే సమస్య - పిల్లల పెంపకం బాధ్యత. ఆయాలు ''మమ్మీ'' లవటం, తల్లి ఒళ్ళో

గారాలు పోవలసిన లేత మొగ్గల్లాంటి పిల్లలు 'Crestes' కి అలవాటుపడటం జరుగుతోంది. 50 ఏళ్ళక్రితం ఇంగ్లండ్‌లో పిల్లలు ఉద్యోగ నిర్వహణలో కూరుకుపోయిన తండ్రిని చూసి "that man who comes for week ends'" అనేవారట. ఇప్పుడు ఉద్యోగస్తులయిన తల్లులతో పిల్లలు రోజులో 2, 3 గంటలకంటే ఎక్కువ గడపలేక పోతున్నారు. 6 - 8 గంటలు నిద్రలో పోతోంది కదా!

కొడుకులు ఉద్యోగస్థు లవడంతో సమష్టి కుటుంబం తెరమాటున పడి పోయింది. పరిమిత కుటుంబాలు (Nuclear Families) నడుస్తున్నాయి. మొగుడూ పెళ్ళాలు ఉద్యోగస్థులై, కొత్త పరిచయాలతో, మానసిక బలహీను లైతే కొత్త వికారాలతో వివాహబంధంలో ముళ్ల సడలుతున్నాయి. తల్లీ, పిల్లల బాంధవ్య సంగమంలో అపశ్రుతులు అక్కడక్కడా వినిపిస్తున్నాయి. విడాకులు ముమ్మరంగా సాగుతున్నాయి. (భర్త గుర్రు పెడుతున్నాడనే నెపం కూడా విడాకులకి దరఖాస్తవుతోంది!) అమెరికాలోనైతే Single - parent syn- drome (పిల్లకి తల్లో, తండ్రో ఒకరే ఉంటారు) ఆచారమైంది. మగవాళ్ళ ధాష్టీకం భరించలేని ఆడవాళ్ళూ, ఆడవాళ్ళ స్వేచ్ఛా ప్రియత్వాన్ని ఆమోదించ లేని మగవాళ్ళూ - అసహజ, స్వలింగ సంపర్కం (Homo sexuality) వైపు మొగ్గుతున్నారు.

కుటుంబం కూకటి వేళ్ళతో కూలిపోతోందా? ఆడా, మగా, పెద్దా, చిన్నా, ఒకరికొకరు ఏమీఅవక మిగిలిపోతారా?

"నిజంగానే, నిజంగానే, హిందు కుటుంబం నశిస్తోందా?"

కుటుంబ పరిరక్షకులు ఆడవాళ్ళే, అన్నారు విజ్ఞులు. (Women are the Vanguards of the family.) మొగుడు పెళ్ళాలు తమ వ్యక్తిత్వాన్ని కించపరచుకోక, దిగజార్చకుండా, స్నేహితుల్లా సమస్యలని పరిష్కరించు కోడానికి ప్రయత్నం చేయాలి. సమాజంలోని సభ్యులుగా, తమ బాధ్యతగా పిల్లల్ని కని, పెంచీ, పెద్దవాళ్ళను చేసి సమాజాభివృద్ధికి దోహదపడేటట్లు చెయ్యాలి. దీనికి కావలసింది ఇరువాగులా కాస్త ఓర్పు, కాస్త నేర్పూ, మరికాస్త సంయమనం. పిల్లల కోసం మొగుడు పెళ్ళాలు ఒకటై, పిల్లలకు అండ, దండగా నిలిస్తే ఈ వైమనస్యాలు, వైషమ్యాలూ, వైరుధ్యాలూ "హుష్ కాకీ" అయిపోవూ? కుటుంబాన్ని రక్షిస్తే - విచ్ఛిపోకుండా - కుటుంబమే మనని రక్షిస్తుంది.

"కుటుంబో రక్షతి రక్షితః."

# భావకవితాయుగ సాహిత్యం - స్త్రీ

—డా॥ లావణ్య సరస్వతి

సాహిత్యాన్ని పరిశీలించేటప్పుడు ముఖ్యంగా మూడంశాలను విమర్శకులు దృష్టిలో ఉంచుకోవాలి: 1. సామాజిక నేపథ్యం, 2. కవి లక్ష్యం - కవితత్త్వం, 3. ప్రభావాలు - ఫలితాలు. ఏ కాలంలోని ఏ సాహిత్యానికయినా ఇవి అన్వయిస్తాయి. భావకవిత్వయుగ సాహిత్య పరిశీలనలో స్త్రీ తత్త్వాన్ని అవగాహన చేసుకోవడానికి వీటిని ఎలా ఆధారం చేసుకోవచ్చో వివరిస్తాను:

**1. సామాజిక నేపథ్యం :** సాహిత్యం సమాజాన్ని పూర్వరంగంగా సమాజపు పరిధిలో పరిశీలించదగిన అంశం. సమాజానికి వెలిగా సాహిత్యపు విలువ కట్టకూడదు. అది అశాస్త్రీయం. ఏ పరిస్థితిలో ఆలోచన వచ్చింది అన్నది తెలుసుకోకుండా విమర్శిస్తే రంగద్దాలతో చూసిన చందమవుతుంది.

భావకవిత్వం వెలువడే నాటికి ప్రబంధ సాహిత్యం, క్షీణ ప్రబంధ సాహిత్యం స్త్రీని మనసులేని అందాల బొమ్మను చేసాయి. అశ్లీల పదాలు, అసభ్య వర్ణనలు సాహిత్యంలో స్త్రీని దిగజార్చాయి. వాస్తవిక సమాజంలో స్త్రీ కుటుంబమే ప్రపంచంగా, వంటిల్లే పరమార్థంగా, పతివ్రతా ధర్మాలను వల్లెవేసుకుంటూ మూఢాచారాల బంధనల్లో బందీ అయింది. విద్యావిహీనురాలిగా ప్రపంచ జ్ఞాన శూన్యమైన జీవితంలో ఉండిపోయింది.

ఈ స్థితిలో సంస్కరణవాదుల దృష్టి స్త్రీపై ప్రసరించింది. బెంగాల్‌లోని సంస్కరణ ఉద్యమాల ప్రభావంతో కందుకూరి వంటివారు స్త్రీ స్థితిగతుల పట్ల వివేచన ప్రారంభించారు. స్త్రీ విద్యకోసం ప్రయత్నం ప్రబలమయింది. కన్యాశుల్కం, వరకట్నం, సతీసహగమనం, బాల్యవివాహాలు, విధవా పునర్వివాహాల వంటి ఆచారాలన్నిటా కేంద్ర బిందువు స్త్రీయే! పత్రికలు, వ్యాసాలు, ఉపన్యాసాలు, కవితలు ఇలాంటి సమస్యలను ప్రజల మధ్యకు తెచ్చాయి.

భావకవులు కలంపట్టేనాటికి స్త్రీకి సమాజంలో సాహిత్యంలో ఉన్నతమైన స్థానమేమీ లేదు. భావకకవులలో మొదటి తరం కవులు ఈ సమస్యల సుడి గుండంలోని స్త్రీని ఉద్ధరించే ప్రయత్నం చేశారు. స్త్రీని చైతన్యమూర్తిని చేయడానికి, విద్యావశ్యకతను నొక్కిచెప్పడానికి, మూఢాచారాలను నిరసించడానికి కవిత్వం వెలువడసాగింది. దీనికి పత్రికలు చేయూత నిచ్చాయి. పత్రికాముఖంగా స్త్రీల వికాసానికి కృషిచేసిన వారిలో అగ్రేసరులు కందుకూరివారు. తెలుగు జనానా పత్రికను మల్లాది వెంకటరత్నంగారు, రాయసం వెంకటశివుడుగారు కూడా కొంతకాలం నడిపారు. శ్రీబాలిక, బాలిక అనే పత్రికలలో రంగాభట్ల గున్నయ్యగారు, సంగీతరావుగారు, బాపిరాజుగారు స్త్రీల సమస్యలను వెలుగులోకి తేవడానికి కృషి చేశారు. మంద వెంకట అప్పారావుగారు స్త్రీలను గూర్చి మంచి పద్యాలు వ్రాస్తుండేవారు

స్త్రీల విద్యా అభ్యుదయాలకు కృషిచేసినవారిలో డా॥ కె.ఎన్. కేసరిగారు ప్రసిద్ధులు. స్త్రీల ఔషధం 'లోధ్ర' మీద సంపాదించిన ధనం స్త్రీ ధనంగా భావించి, దానిలో అధికభాగాన్ని స్త్రీ జనాభ్యుదయంకోసం వెచ్చించాలని నిర్ణయం తీసుకున్న విశాల హృదయులు కేసరిగారు. 1928 లో గృహలక్ష్మి పత్రికను స్థాపించారు. "సృష్టికి మూలాధారము స్త్రీ. గృహమునకు పెట్టని దీపము స్త్రీ. పురుషుని కీర్తిప్రతిష్టలకు మూలకందము, సంపదకాధారము, సంసారసాగరమునకు నావయై పురుషులను సురక్షితముగ దరిచేర్చు మహదుపకరణము స్త్రీయే" అని నమ్మి స్త్రీల ఆరోగ్యము, విద్య, మొదలయినవి ఎప్పుడభివృద్ధి పొందుతాయో అప్పుడే జాతి, దేశము బాగుపడగలవనే భావాలను ప్రచారానికి తెచ్చింది 'గృహలక్ష్మి.'

'వివేకవతి' పత్రిక సంచికలలో "గుణవతి యగు స్త్రీ ముత్యము కంటె అమూల్యమైనది" అనీ "సకల జన సంస్తవము నందవలయును స్త్రీ" అనీ ప్రముఖంగా ప్రచురించేవారు.

ఈ విధంగా అనేక రకాలుగా పత్రికలలో వెలువడే భావాలు భావకవుల కవితాస్పృహకు స్ఫూర్తినిచ్చాయి. భావకవిత్వంలో స్త్రీల సమస్యలు, స్త్రీ గుణగణాలు చోటు చేసుకున్నాయి. భావకవుల స్త్రీ పాత్రలు ఈ సామాజిక

నేపథ్యంలోంచి సాహిత్య పూర్వరంగం నుంచి వెలువడ్డాయి. భావ కవుల స్త్రీ పాత్రల వర్ణనను రెండు కోణాల్లో పరిశీలించవచ్చు. 1. స్వరూప వర్ణన, 2. స్వభావ వర్ణన.

**1. స్వరూప వర్ణన :** స్త్రీ సౌందర్యాన్ని అంగ సౌష్ఠవంతో కాక భావనా బలంతో భావకవులు ప్రదర్శించారు.

"నీవు తొలిప్రొద్దు నునుమంచు తీవసొనవు
నీవు వర్షాశరత్తుల సిబిడ సంగమమున బొడమిన సంధ్యాకుమారి"

"తారయై, పూవై', 'విలసితలావణ్యశ్రీయై', 'నవనిత్య మౌనానంద ప్రాణియై', 'విద్యున్నారియై' 'జీవన దేవతయై' 'సుప్తమధుకీలయై' 'స్వప్నలోక రాజ్ఞియై' 'తపఃఫలసిద్ధ మూర్తియై' 'సుధాబాలయై' 'మధుర ప్రమీల'యై భావ కవుల భావసీమలలో భాసించింది స్త్రీ. ఊర్వసి, కిన్నెరసాని పాటలు, ఎంకి పాటలు, శశికళ, హృదయేశ్వరి, సౌభద్రుని ప్రణయయాత్రలలో స్త్రీ సుకుమార సుందర సత్యవర్ణనల సుధ్య రూపం పోసుకుంది.

**2. స్వభావ వర్ణన :** ఉన్నత స్వభావానికి, ఉత్తమ గుణాలకి ప్రాతినిధ్యం వహించే స్త్రీ కావ్యాలలో ఆవిష్కరించబడింది. ఆమెలోని మాతృవాత్సల్యాన్ని సోదరీ మమకారాన్ని, పుత్రికా అనురాగాన్ని కావ్యాలలో ప్రకటించారు. స్త్రీలోని వివిధ కోణాలలోని అమృత వాత్సల్యాలను దర్శించి కీర్తించారు. స్త్రీని గుణవతిగా చిత్రించి గౌరవాదరాలను పెంచారు. కనుకనే భావకవుల సాహిత్యంలో స్త్రీ ప్రతిమగాకాక వ్యక్తిగా సాక్షాత్కరించింది. రాయప్రోలు, విశ్వనాథ, దువ్వూరి, అబ్బూరి, నండూరి, నాయని వార్ల నాయికలు స్త్రీలోని ఉన్నత గుణగణాలకు ప్రతినిధులే.

సామాజిక సమస్యలలోని సామాన్య స్త్రీని కావ్యనాయికను చేసి తత్పూర్వ సాహిత్య స్థితిలోని స్త్రీని భావకవులు ఒక మలుపు తిప్పారు. ఇదే అప్పటికి సాహసం. పండితులనుండి, సంప్రదాయజ్ఞుల నుండి, ఛాందసుల నుండి తీవ్ర విమర్శను భావకవులు చవిచూశారు. భావకవిత్వంలాగా విమర్శకుల చేతిలో నలిగిన మరొక నవ్యకవితోద్యమం లేదు. దీనికి కారణం ఇది ఒక పెద్ద మార్పును

సంచలనాన్ని సాహితీ రంగంలో తీసుకురావడమే. ఇంత తీవ్రమయిన ప్రతి ఘటనల మధ్య స్త్రీ విషయంగా ఈ పాటి మార్పునైనా తీసుకురావడం సాహసమే. అక్కడికి అదే అభివృద్ధి. ఏ అభివృద్ధి అయినా ప్రగతి అయినా క్రమపరిణామంగా వికాసం పొందుతుంది గాని ఒక్కసారిగా రాదు. ఒక్కొక్క మెట్టు ఎక్కి పైకి చేరడం జరుగుతుంది గాని ఒక్కసారిగా పైకెగరాలనుకోవడం అర్థంలేని పిల్లచేష్ట.

ఈనాడు మనం స్త్రీ విషయంగా ఆలోచించేరీతి క్రమ పరిణామంగా క్రమ వికాసంగా భావకవులనాటినుంచి పరిణమించిందేగాని అకస్మాత్తుగా ఈనాడు కలిగిందికాదు. ఈనాడు మనం ఆలోచించినట్లే వారు ఆలోచించలేదనుకోవడం మన ఆలోచనారాహిత్యాన్ని సూచిస్తుందేగాని ఆనాటి కవుల ఆలోచనలో లోపాన్ని కాదు. ఈనాటి ఈ మార్పుకు ఆనాటి వారి ఆలోచనాసరళి పునాది అన్నది మనం అంగీకరించాల్సిన సత్యం.

కవితత్త్వం, ఫలితాలు అన్న అంశాల ఆధారంగా ఈ సాహిత్యాన్ని పరిశీలించినపుడుకూడా ఈ సత్యమే నిరూపింపబడుతుంది.

**2. కవితత్త్వం - కవి లక్ష్యం :** ఆధునిక కవి ఆదర్శం, తత్త్వం, లక్ష్యం, స్వభావం అంచనా వేయడానికి ఆధారాలు ఎక్కువగా ఉన్నాయి. వ్యాసాలు, ఉపన్యాసాలు, ఇంటర్వ్యూలు, చర్చలు, రేడియో ప్రసంగాలు, పరిశోధనా వ్యాసాలు కవుల స్వభావాన్ని, కవితా లక్ష్యాలను, కవితత్త్వాన్ని మనకు స్పష్టంగా చూపుతాయి.

ఈ అన్నిటిని ఆధారంగా చేసుకుని సాహిత్యాన్ని అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించాలి. అంతేగాని మనం చూసిన ఒక్క భాగాన్నో, పద్యాన్నో, పదాన్నో, అంశాన్నో తీసుకుని భావకవులు స్త్రీ గూర్చి ఇలాటి అభిప్రాయం కలిగి ఉన్నారు అని అంచనా వేయడానికి పూనుకోవడం గుడ్డివాడు ఏనుగును వర్ణించినట్లుంటుంది.

సాహిత్యాన్ని సమాజానికి దగ్గరకు తేవడం భావకవుల లక్ష్యం. సామాన్యులను పాత్రలను చేయడం సంకల్పం. తమ మదిలో భావాలను కవితామయం చేయడం తత్త్వం. ప్రేమ గీతాలను ఆలపించారు. స్త్రీని హృదయ పీఠంపై నిలిపారు. దైవత్వాన్ని దర్శించారు. ఆరాధించారు. అనురాగం పంచారు. నిజమేకాని, పీఠిలో స్త్రీ భోగవస్తువు, అంగడిలో బొమ్మ అన్న దృష్టి కంటే హృదయంలోని మమతానురాగాలను పంచుకునే నెచ్చెలి అన్న భావనే అధికంగా ద్యోతకమవుతుంది. ప్రముఖులైన భావ కవుల రచనలలో ఎక్కడా స్త్రీని హీనంగా దర్శించే తత్త్వం కనబడదు. అగౌరవభావంగాని కించపరచడం గాని వీరి లక్ష్యం కానేకాదు. అసభ్యచిత్రణ వీరితత్త్వం కాదు. ఒకరిద్దరు తదనంతర కవుల రచనలలో ఎక్కడయినా స్త్రీ వర్ణన కొద్దిగా హద్దు మీరినా సభ్యత సడలినా అది అల్పశాతంలోకి పోయి తెరమరుగున నిలిచిందేగాని పరిగణించదగిందికాదు. ఆ రచనలకుగాని కవులకుగాని ఉత్తమశ్రేణి, అధిక ప్రచారం లభించలేదు. కనుక మొత్తం మీద భావకవిత్వం స్త్రీ పట్ల సభ్యతా సభ్యతలను గుర్తెరిగి యథోచితంగా ప్రవర్తించిందనే చెప్పాలి.

3. **ప్రభావాలు-ఫలితాలు** : ఏ సాహిత్యమైనా తన తదనంతర సాహిత్యం మీద సమకాలీన కవులమీద సంఘం మీద ఎలాటి ప్రభావాన్ని చూపిందనే అంశం మీదనే ఆ సాహిత్యానికి గౌరవం ఏర్పడుతుంది. స్త్రీ పరంగా ఈ భావకవితా యుగ సాహిత్యం మొత్తంమీద ఏ వాతావరణాన్ని చూపింది? ఎలాంటి ప్రభావాన్ని చూపింది? ఆరోగ్యకరమైన మార్పును తెచ్చిందా? లేక అనాదరణీయమైన స్థితిని తెచ్చిందా? అన్నదికూడా విమర్శకులు పరిశీలించాలి.

ఈ దృష్టితో చెప్తే స్త్రీ విషయంగా భావకవిత్వం సభ్యతను పెంచిందని చెప్పాలి. అసభ్యతను నెట్టివేయడానికే అది ప్రయత్నించింది. స్త్రీ పట్ల గౌరవాభిమానాలను పెంపొందింప జేయడానికే కృషి చేసింది. సమస్యల వలయం నుంచి వెలికితీయడానికే సహకరించింది. ఈ కృషి ఫలితాన్ని పొందింది కూడా. ఊహా ప్రేయసులను సృష్టించినా, ప్రేమ గీతాలను ఆలపించినా, సాహిత్యంలో స్త్రీకి ఉన్నత పీఠం, గౌరవం లభించాయిగాని, స్త్రీ పట్ల నీచభావన గాని, అగౌరవ స్థితిగాని కలిగేలా చేయలేదు. తరువాత వచ్చిన ఉద్యమాలన్నిటాకూడా స్త్రీ అసభ్య చిత్రణకు గురికాకపోవడానికి భావకవులు వేసిన ఈ పునాది కారణమని

చెప్పవచ్చు. అమలిన శృంగారం, కులపాలికా ప్రణయం లాటివి స్త్రీ గౌరవానికి దోహదం చేసినవేకాని అర్థంలేని వ్యర్థ సిద్ధాంతాలు కావు. ఊహా ప్రేయసులను సృష్టించిన కృష్ణశాస్త్రిగారిలో కూడా స్త్రీకి ప్రేయసిగా హృదయంలో ఉన్నత స్థానాన్నిచ్చిన పవిత్ర చిత్రణే కాని అసభ్య, అశ్లీల, అసహ్య భావనకు ఆస్కారమే లేదు.

ఈ విధంగా భావకవిత్వం స్త్రీకి సాహిత్యంలో గౌరవాదరాలు పెంచడానికి దోహదం చేసింది. ఆమె సమస్యలను వెలుగులోకి తెచ్చింది. ఈనాడు స్త్రీ కళ్ళు తెరచి గొంతు విప్పి తన బాధలు చెప్పుకోడానికి కావలసిన వ్యక్తిత్వాన్ని ఆత్మస్థైర్యాన్ని పెంచుకోవడానికి పరోక్షంగా ప్రేరణ నందించింది. భావకవిత్వంలో ఒక శాఖగా వెలసిన సంఘ సంస్కరణ కవిత్వం సమస్యల ప్రచారాన్ని ఆనాడే చేయడానికి పూనుకుంది. మన సమస్యలను మనకంటే ముందే కవితామయం చేసి ప్రపంచాని కందించింది.

# అభ్యుదయకవిత్వంలో స్త్రీ

—డా॥ వై. కామేశ్వరి

ఆధునిక కవిత్వంలో ప్రతి ఉద్యమమూ తనకు పూర్వపు కవితోద్యమంలో లేని అంశాన్ని తన జెండాగా ఎత్తి చూపుతూ సాగిపోతూ ఉంటుంది. అభ్యుదయ కవితోద్యమం కూడా ఇలాగే ప్రారంభం అయింది. అందుచేతనే కాబోలు ప్రణయం, స్త్రీ పురుష అనుబంధం, కాల్పనికపు ఊహలతో నిండిన భావ కవిత్వానంతరం వెలువడిన అభ్యుదయ కవిత్వంలో స్త్రీ ప్రసక్తి చాలా కొద్దిగా కనిపిస్తుంది. వాస్తవికాంశాలకు ప్రాధాన్యం హెచ్చుగా ఉంటుంది.

భావ కవిత్వంలోని ప్రతి అంశాన్నీ, నగర జీవనంలోని ప్రతి భాగాన్నీ వ్యంగ్యంగా విమర్శిస్తూ సాగిన పఠాభి ఫిడేలు రాగాల డజన్‌లో స్త్రీ కూడా అన్నింటితోపాటు విమర్శకు గురి కావడమే కాదు - అవమానం పాలు కూడా అయింది.

"రామయ్య సతిగా నుంటకన్న
రావణుని ప్రియురాలిగా వుండి
హృదయంగల అసురుణ్ణి అమరుణ్ణిగా
చేసిఉండేదానిని నా ప్రేమబలంతో"—(సీత-ఫి డ. పేజి 7)

"నీ యాకారమంతా, నిజంగా మహా
అందంగా వున్నది; నీ యందం
శాఖాహారులగు నావంటి వారికూ్కడా
మాంసాహారం మీదికి
బుద్ధి పోనిస్తున్నదో నవ్యస్త్రీ"—(నవ్యస్త్రీ ఫి.డ. పేజి 35)

ఇటువంటి భావాలతో కవిత రాసిన పతాభే. ఒకపక్క- "సతీత్వబద్ధం" అంటూ "పతివ్రతా శిరోమణి సీత, భారతీయ స్త్రీమూర్తి సీత, అట్టి సీతగా ఉండే భాగ్యం అది అందరాని అపూర్వ మహాభాగ్యం కదా!!'' అని కూడా అంటాడు. ఈ కవే బోగం స్త్రీపై సానుభూతిని చూపుతాడు. ఈ విధంగా అభ్యుదయ భావాలకు, భావకవిత్వ గుణాల నిరసనకు మధ్య ఉండే గజిబిజి ఫిడేలు రాగాల డజన్‌లో కనిపిస్తుంది. ప్రతి ఉద్యమ ప్రారంభంలోను ఈ తికమక తప్పనిదే.

నయాగరా కవితా సంకలనంలో స్త్రీ ప్రసక్తి ఇంచుమించుగా లేదనే చెప్పాలి. రామదాస్ మాత్రమే -

''అనార్కలీ
సమాధిలో
అశ్రుదీపికలు
వెలిగించిన
నా గీతం'' (నా గీతం, నయాగరా పే. 11)

అంటూ ప్రణయపు విలువకు పెద్దపీట వేస్తాడు.

''మతాధినేతల
శాస్త్రాల చెప్పుల క్రింద
నలిగి నలిగి రోదించే
పసితనంలో పతిపోయిన
అమాయక కన్యలార'' (చెరసాల, నయాగరా పే. 29)

అంటూ బాల వితంతువుల పట్ల సానుభూతి చూపుతాడు. పురిపండా ''పల్లక పడుకోనీ'' అనే కవిత నిస్సహాయ వంచిత స్త్రీ ఆత్మహత్యను చిత్రిస్తుంది. ''వేకువ యామిని'' భర్తను కోల్పోయిన స్త్రీ యాతనను వివరిస్తుంది.

''మానవలోకంనిండా
మంటలసస్యంకోసం
నా కలమే
హలమైతే

మంటల మెరిసేపిల్లా
జంటగ రా
వెంటనె రా! (పసుపూ కుంకం, పులి పంజా పే 77)

అంటూ కవితాస్ఫూర్తిని స్త్రీరూపంగా చిత్రిస్తారు పురిపండా.

శ్రీశ్రీ కవితలలో "భిక్షువర్షీయసి" సుప్రసిద్ధమే. ఇందులో ముసలి భిక్షుక స్త్రీ దీనస్థితి కళ్ళకు కట్టినట్టు వర్ణింపబడింది. అయితే మహాప్రస్థానం మొత్తం మీద మళ్ళీ స్త్రీ ప్రసక్తే ప్రత్యక్షంగా కనరాదు. ప్రత్యక్షంగా అని ఎందుకు అన్నానంటే-కవితను దేవిగా, జననిగా భావించిన 'అద్వైతం', 'కవితా ఓ కవితా' అనే కవితలు మహాప్రస్థానంలో ఉన్నాయి కనుక.

"ఓహో! ఓ రసధుని! మణిఖని! జననీ! ఓ కవితా!" అంటూ కవితా ఓ కవితాలో స్పష్టంగా జననీ భావం ఉంది కనుక ఎవరికీ పేచీ ఉండదు. అయితే "అద్వైతం" కవితాఖండికకు అనాదిగా వర్గ సంఘర్షణ ఆధారంగా భాష్యం చెప్పటం మార్క్సిస్టుల సంప్రదాయం. నిజానికి ఇది కవి కవితల అద్వైతాను బంధాన్ని వర్ణించే అపురూప కవితాఖండం. ప్రతి పద్యం చివర ముక్తాయింపు లాగా ఉపయోగించిన జంట పాదాలలో నీవు - నేను కలసి "మనం"గా రూపొందడం- ఈ విషయాన్ని నిరూపించే ఆంతరంగిక సాక్ష్యం. కవిత అంతటా క్రమాలంకారం నిండి ఉంది. నిజ జీవనంలోని భేదం కవితలో ఆహ్లాదకరంగా మారుతుంది. ఈ కవితలోని నేను కవికి, అతని వాస్తవ జీవనానికి, ఆ జీవన కాఠిన్యానికి ప్రతీక. అయితే ప్రేయసి ఆభాసగా నిలచిన 'నీవు' కవితకు, ఆ కవితాదర్శానికి ప్రతీక. ఆ 'నీవు' కవితకు, కవికలంకు ప్రతీక.

"నీ మోవికి కావిని నేనై
నా భావికి దేవివి నీవై"............... ఈ విధమైన చిత్తశుద్ధితో కూడిన కవి కవితల 'అద్వైతం' ప్రపంచ భవిష్యత్తును పరిపాలింప చేయడంలో ఆశ్చర్యం లేదు. నిజ జీవన సంక్షోభం విషమించినపుడు శక్తిమంతమైన కవితా రూపంలో కవి వ్యక్తమై ప్రపంచంలో మార్పును తీసుకు రావడం జరుగుతుంది. ఈ కవితను చదివేటప్పుడు సోలో పాడుతున్నట్లు అనిపించదు - యుగళగీతం వింటున్నట్లే వుంటుంది.

కుందుర్తి "సత్య సందర్శనం"లో సత్యాన్ని స్త్రీ రూపంగా దర్శిస్తాడు.

"సమస్త వర్ణ సమామ్నాయం
శాలువగా కప్పుకొంది
తత్వవేత్తల మహాదర్శనం
తలపాగా చుట్టుకుంది
.... ....... .......
ఒక చేతికి రంగు రంగుల రాజులు" (నగరంలో వాన పే 14)
"మూడునాళ్ళ పసిపాపను
ముద్దుగా ఒడిలో గుండెకద్దుకుంటూ
వెచ్చగా ఆస్పత్రినుంచి పచ్చగా యింటికి వెళ్ళే
పచ్చి బాలెంతరాలు" (నగరంలోవాన పే 3/4)

ముగ్ధగా ఆయన కవితలో దర్శనం ఇస్తుంది.

దేవరకొండ బాలగంగాధర తిలక్ భావ కవిత్వం నుండి అనుభూతి కవిత వరకు పయనించిన బాటసారి. ఆయన కవితలలో స్త్రీ ప్రణయదేవతగానే కాదు- పరాశక్తిగాను కనిపిస్తుంది. ఊహా ప్రేయసిగానే కాదు- సన్నిహిత సహచరిగాను గోచరిస్తుంది.

"నా ఏడుపు నాకు తప్ప లోకానికి వినిపించనివేళ
నే కూరుకు పోతున్న చాతకాని తనపు వానాకాలపు బురదమధ్య
నీ పాట ఒక్కటే నిజంలాగ నిర్మలమైన గాలిలాగ నిశ్శబ్ద నదీతీరాన్ని
పలకరించే శుక్తిగత మౌక్తికంలాగ
ఇంటిముందు జూకా మల్లెతీగలో అల్లుకుని లాంతరు వెలుతుర్లో
క్రమ్ముకొని నా గుండెల్లో చుట్టుకొని గాలిలో ఆకాశంలో
నక్షత్రం చివరి మెరుపులో దాక్కొని నీరవంగా నిజంగా వుంది"
(నువ్వులేవు నీ పాటవుంది, అమృతం కురిసిన రాత్రి)

ఈ కవితలోని ప్రణయమూర్తి ఊహాప్రేయసి కాదు - కష్టం సుఖం పురుషునితో సమంగా పంచుకొన్న సహచరి కనిపిస్తుంది. 'ప్రవహ్లిక'లో స్త్రీని "నాకు తల్లివి నెచ్చెలివి చెలివి" అంటూనే "నన్ను కౌగలించుకున్న పెద్దపులివి" అనడాన్ని ఎందరో విమర్శించారు. నిజానికి ఈ కవిత స్త్రీ సమస్త కోణాలను చిత్రించే అపూర్వ ఖండిక. పెద్దపులి అన్నపుడు తిలక్ భావం స్త్రీ సర్వశక్తి మంతురాలనే కాని మరొకటి కాదు. ఆమె పురుషుని సమస్త క్రియాశీలతను మూలమైన శక్తి రూపిణి. భారత్ - చైనా సరిహద్దులో నిలచి పోరాడి గతించిన ఒక సాహస వీరుని భార్య 'అమ్మా, నాన్న ఎక్కడికి వెళ్ళాడు'లో చిత్రితమయింది. ఆమె మృదు గర్వం, దుఃఖం సున్నితంగా సూచింపబడ్డాయి.

"చూలాలి నెవరినైనా చూడగానే నేను
జోడిస్తాను చేతులు పూజిస్తాను మనస్సులో
మానవ జాతి యిక ముందు మరణించబోదని
మౌనంగా హామీ యిస్తుంది ప్రతి గర్భవతి"

(రేపటి చూలాలు; ఆరుద్ర రచన పే. 222/226 కవితలు

అంటూ సృజన భారాన్ని వహించిన స్త్రీ జాతికి విన్రముడౌతాడు ఆరుద్ర.

"అఖండమై అనంతమై ఈ అరణ్యావాసం ఎన్నాళ్ళమ్మా నీకు
ఎంత నెత్తురని ఎత్తిపోతలు పోయగలవమ్మా నీవు?
ఎంత త్యాగం, ఎంత బాధ చేయగలవు మోయగలవు?"

(బాధాగాథము; అంగారవల్లరి పే. 34/35)

అంటూ సకలాంధ్రావనికి ప్రతీకగా గోదావరీ నదీమతల్లికి ప్రణతుడౌతాడు కె. వి. రమణారెడ్డి.

మొత్తంమీద స్త్రీ ప్రసక్తి స్వల్పంగానే ఉన్నా అభ్యుదయ కవుల హృదయంలో ఆమె స్థానం అనల్పంగానే ఉన్నదని ఈ పరిశీలనలో తేలింది. స్త్రీని నిజ జీవన దుఃఖంతోను, కాల్పనిక విలువలతోను, దైవిక శక్తితోను కూడా దర్శించి - అభ్యుదయ కవులు భావ కవుల కంటే కూడా స్త్రీని గౌరవించడంలో ఒక అడుగు ముందుకు వేశారని చెప్పవచ్చు

## ఉపయోగించిన పుస్తకాలు


1. అంగార వల్లరి : ఖండకావ్యం; రమణారెడ్డి అ.ర.సం విజయవాడ 1959.
2. అమృతం కురిసిన రాత్రి : రెండవ కూర్పు, బాలగంగాధర తిలక్ దేవర కొండ; ప్రచురణ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; చంద్రం బిల్డింగ్స్; విజయవాడ - 4. ప్ర.ము. 1968, నా.ము. జూన్ 1984.
3. ఆరుద్ర రచన; కవితలు; ఆరుద్ర; విపుల సంకలనం; క్వాలిటీ పబ్లిషర్స్, రామ మందిరం వీధి విజయవాడ 1985.
4. నగరంలో వాన; కుందుర్తి; ఫ్రీవర్స్ ఫ్రంట్ హైదరాబాదు; ప్ర. ము. సెప్టెంబర్ 1967.
5. నయాగరా; రామదాస్, ఆంజనేయులు, సుబ్రహ్మణ్యం; ద్వి ము. 1975. ఫ్రీవర్స్ ఫ్రంట్; హైదరాబాదు ప్ర. ము. 1944.
6. పులిపంజా : అప్పలస్వామి పురిపండా; విదేశాంధ్ర ప్రచురణలు లండన్ ప్ర.ము. 1976
7. ఫిడేలు రాగాల డజన్ : పఠాభి; వర్ధమాన సమాజము టౌన్ హాల్ ట్రంకు రోడ్డు; నెల్లూరు - 1 ప్ర.ము. 1939 ద్వి. ము. 1973 సెప్టెంబర్.
8. మహాప్రస్థానం : శ్రీశ్రీ; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ చంద్రం బిల్డింగ్స్ విజయవాడ తొలికూర్పు 1950; 16 వ కూర్పు 1981.

# ఇటీవలి కవిత్వంలో స్త్రీవాద ధోరణులు

—శ్రీ బి. భుజంగరెడ్డి

కవులందరి స్పందనలూ ఒకే రకంగా ఉండవు కాబట్టి కవిత్వమెప్పుడూ ఏకముఖంగా సాగదు. ఒకే కాలంలో భిన్న భావజాలాలకు చెందిన కవిత్వం వస్తూనే ఉంటుంది. ఇటీవలి కవిత్వం (ఈ దశాబ్దం)లో కూడా అనేక శాఖలు వస్తున్నాయి. సంప్రదాయ కవిత్వం, భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం మొ॥వి అలాంటి శాఖలే. ఈ దశాబ్దంలో బలంగా, సూటిగా వస్తున్న ప్రధాన శాఖ స్త్రీవాద కవిత్వం.

## స్త్రీవాదం అంటే ఏమిటి?

సమాజంలోనూ, కుటుంబంలోనూ స్త్రీల అణిచివేతను ఖండిస్తూ, స్త్రీలు తమ సెక్స్‌వల్ల తక్కువగా చూడబడటాన్ని వ్యతిరేకిస్తూ, స్త్రీవిముక్తికోసం యిప్పుడున్న దోపిడీ వ్యవస్థను రూపుమాపటానికి స్త్రీలూ, పురుషులూ కలిసి చేసే రాజకీయ కార్యక్రమమే స్త్రీవాదం.

## ఏది స్త్రీవాద కవిత్వం?

సమాజంలోనూ, కుటుంబంలోనూ స్త్రీలపై జరుగుతున్న అణిచివేతను చిత్రిస్తూ, ఆ అణిచివేతను ఖండించి, స్త్రీలు విముక్తి కావడానికి యిప్పుడున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విధానాలలో రావలసిన మార్పులను సూచించిన కవిత్వాన్ని స్త్రీవాద కవిత్వమని చెప్పవచ్చు.

నేటి స్త్రీవాద కవిత్వాన్ని పరిశీలించేముందు స్త్రీల సమస్యలపై ప్రాచీన కాలం నుండి వచ్చిన కవిత్వాన్ని పరిశీలించాలి. దానివల్ల నేటి స్త్రీవాద కవిత్వానికి ప్రాచీన కవిత్వానికి ఉన్న భేదం సులభంగా అర్థమవుతుంది. నేటి స్త్రీవాద కవిత్వం ప్రత్యేకత ఏమిటో తెలుస్తుంది.

శిష్ట సాహిత్యంలో స్త్రీలు కవిత్వం రాయటం భక్తి కవిత్వంతో మొదలయింది. ఆనాటి కవయిత్రులు భగవంతుణ్ణి ఉద్దేశించి తమ భావాలను వెలిబుచ్చారు. తొలి తెలుగు కవయిత్రిగా చెప్పబడుతున్న తాళ్ళపాక తిమ్మక్క కవిత్వం భక్తి కవిత్వమే. మధ్య యుగంలో మధురవాణి, రంగాజమ్మ, రామభద్రాంబ, తరిగొండ వెంగమాంబ, గంగాదేవి మొ॥ వారు పురుష దృక్పథంలోంచే కవిత్వం రాశారు. కొంత స్వేచ్ఛతో స్త్రీపురుషుల శృంగారాన్ని వర్ణించిన ముద్దుపళని స్త్రీజనాభ్యుదయవాదిగా పేరొందిన వీరేశలింగంగారి మాటు విమర్శకే గురయింది. ఆధునిక యుగంలో ఇనగంటి సరస్వతీదేవి వంటివారు —

"పడతి పుట్టుకతోడనే పరుని సొత్తు
నీట ముంచిన పాల ముంచినను ప్రాణ
కాంతుడే దైవమంచు నెక్కాల మెంచి
అతని మెప్పించి మెప్పొంద నగును సతికి"[1] అంటూ స్త్రీలకే బుద్ధులు చెప్పటానికి ప్రయత్నించారు. వీరిపైన పితృస్వామ్య సమాజం ప్రభావం ఎంతగా పడిందో సులభంగానే గ్రహించవచ్చు. భావకవితా యుగంలోని కవయిత్రులయిన తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, చావలి బంగారమ్మ, బసవరాజు, రాజ్యలక్ష్మమ్మ వంటివారు పురుష ప్రభావంలోంచే కవిత్వం రాశారు. నా ఎంకి, నా ఊర్వశి, నా హృదయేశ్వరి అంటూ కవిత్వం వచ్చినట్లుగా నా పురూరవుడు, నా శశాంకుడు, నా విక్రమార్కుడు అంటూ కవిత్వం రాలేదు. ఈ శతాబ్ది ప్రారంభంలో పురుషాధిపత్యాన్ని వ్యతిరేకించిన ఒకేఒక్క కవయిత్రిగా ఆత్మూరి అన్నపూర్ణమ్మగారు కనిపిస్తున్నారు. ఈమె —

"నీ సతియె నీకు మిత్రము
నీ సతియె నీకు తోడు నిజముగ సుమ్మీ
రోసమున సతిని దూరిన
మోసము నీ సౌఖ్యమునకు ముందు కుమారా!"[2] అని హెచ్చరిస్తూ 'కుమార సుగుణ బోధిని' శతకం రాశారు. ఆధునిక కాలంలో ముఖ్యంగా 1950-80 మధ్యకాలంలో ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, నాయని కృష్ణకుమారి, శారదా అశోకవర్ధన్, సి. వేదవతి, ఎ. లక్ష్మీరమణ, దుర్గం తారాబాయి, దర్భా భాస్కరమ్మ, శీలా సుభద్రాదేవి, కొలకలూరి స్వరూపారాణి, పచ్చిగోళ్ళ సుధ

మొ॥వారు కవయిత్రులుగా మేల్కొన్నారు. మొత్తంమీద ఈ దశాబ్దం ప్రారంభ మయ్యేదాకా ప్రాచీన కవిత్వంలోగాని, ఆధునిక కవిత్వంలోగాని కవయిత్రుల సంఖ్య వేళ్ళమీద లెక్కించదగినదిగానే ఉండిపోయింది.

ఇక కవుల విషయానికి వస్తే, ఆధునిక యుగంలో భావకవులు స్త్రీని దేవతగానో, ప్రేయసిగానో చూశారే తప్ప ప్రాణమున్న మనిషిగా గుర్తించలేదు (రాయప్రోలు వారి 'స్నేహలత' ఇందుకు అపవాదం.) సంఘ సంస్కరణోద్యమ కవిత్వంలో మంగిపూడి వేంకటశర్మ, భోగరాజు నారాయణమూర్తి మొ॥వారు స్త్రీ సమస్యలపై మంచి కవిత్వమే రాశారు. గురజాడ స్త్రీలపట్ల సంఘంలో ఉన్న దురాచారాలను ఖండించి, స్త్రీ పురుష సమానత్వాన్ని ప్రతిపాదించారు. అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీ వంటి వారు "పడుపుకత్తె రాక్షస రతిలోని భయంకర బాధల పాటల పల్లవిని' అరుదుగానే వినిపించారు. దిగంబర కవులు స్త్రీ సమస్యలపై కొన్ని మంచి కవితలు రాసినా, స్త్రీలను కించపరిచే మాటలనే తమ కవిత్వంలో ఎక్కువగా వాడారు. విప్లవకవుల్లో ప్రఖ్యాతుడైన శివసాగర్ 'ఆకాశంలో సగభాగం స్త్రీలు' అన్న మావో కవితామయ వాక్యాన్ని తీసుకొని, పోరాటంలో స్త్రీ పురుషులిద్దరూ ఉద్యమించాలని చెప్తూ—

"ఆకాశంలో సగం నీవు సగం నేను
మనిద్దరం కలిసి ఉద్యమిస్తే ఉప్పెన
విప్లవిస్తే విజయం"[3] అని అన్నారు. విప్లవకవుల్లో చెరబండరాజు, గద్దర్, వరవరరావు, యువక వంటివారు స్త్రీ విముక్తిని కోరుతూ కవిత్వం రాశారు. మొత్తం మీద విప్లవకవితాయుగంలోనూ స్త్రీ సమస్యలపై కవిత్వం రాసిన కవులు తక్కువేనని చెప్పాలి. సిద్ధాంతపరంగా స్త్రీలను ప్రత్యేక వర్గంగా చూడటం వారిని ఉద్యమం నుంచి విడదీయటమేనన్న భావం కూడా అభ్యుదయ, విప్లవ కవిత్వాల్లో స్త్రీ సమస్యలు ప్రత్యేక స్థానం పొందటానికి కారణం కావచ్చంటారు రవీంద్రరెడ్డిగారు. కాని, విప్లవోద్యమంలో పనిచేసేవారికి స్త్రీలపట్ల గౌరవ భావం, సమభావం లేకపోవడమే అందుకు కారణమని చెప్పవచ్చు. విప్లవోద్యమంలో స్త్రీలను సబార్డినేషన్‌కు గురిచేస్తుండడమే అందుకు సాక్ష్యం.

1910 ప్రాంతంలోని సంఘ సంస్కరణోద్యమం, 1935 ప్రాంతంలోని జాతీయోద్యమం, 1950 ప్రాంతంలోని తెలంగాణ పోరాటోద్యమం, 1970 ప్రాంతంలోని శ్రీకాకుళ గిరిజన పోరాటోద్యమం, చలం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, కుటుంబరావు, ఎగ్నెస్‌స్మెడ్లీ, కమలాదాస్, శరత్ మొ॥వారి సాహిత్యాలు స్త్రీ పురుషుల్లో చైతన్యాన్ని పెంపొందిస్తూ వచ్చాయి. ప్రధానంగా స్త్రీలల్లో వారి అణిచివేతకు సంబధించిన అవగాహనను కలిగించాయి. ఈ నేపథ్యంలోంచే నేటి స్త్రీవాద కవిత్వం పుట్టుకొచ్చింది.

ఈ వ్యాసంలో ప్రధానంగా రేవతీదేవి, జయప్రభ, కొండేపూడి నిర్మల, ఈశ్వరి, విమల గార్ల కవిత్వంతోపాటు కొంతమంది కవుల కవిత్వాన్ని కూడా విశ్లేషించటం జరుగుతుంది.

## రేవతీదేవి కవిత్వం :

1980 లో రేవతీదేవి గారి కవితల సంకలనం 'శిలాలోలిత' పేరుతో అచ్చయింది.[4] ఆధునిక తెలుగు కవిత్వంలో తొలిసారిగా నిస్సంకోచంగా, నిర్భయంగా, స్వేచ్ఛగా, స్పష్టంగా తన భావాలను కవిత్వీకరించిన స్త్రీ రేవతీదేవిగారు. ఈ సమాజం తను చెప్పదలుచుకున్నదాన్ని చెప్పడానికి వీల్లేకుండా చేసిందని ఈమెకు దిగులు. దిగు లెందుకని ఎవరైనా ప్రశ్నిస్తే - "ఎందుకా/ఎందుకో చెప్పేవీలుంటే/దిగులెందుకు" అంటారు. ఒక స్త్రీని కవిగా ఎదగడానికి వీల్లేకుండా చేసిన సమాజ స్వరూపాన్ని ఎత్తిచూపారు. ఈమె స్త్రీల గురించి రాసిన కవితలు చిన్నవే (పరిమాణంలో) అయినా, అందులో పదునైన భావాల్ని పొందుపరిచారు. 'రుచించని మాట' అనే ఖండికలో-

"మగవాళ్ళకి చాటుగానూ
ఆడవాళ్ళకి పబ్లిగ్గానూ
రుచించనిమాట చెప్పనా
మగకీ, ఆడకీ
శీలాన్ని, ఆస్తినీ
సమంగా వర్తింపించండి
కాగితాల మీదా వేదికల మీదా కాదు
నిజంగా సమంగా వర్తింపించండ"న్నారు.

ఈ పితృస్వామ్య వ్యవస్థలో 'శీలం' స్త్రీకి మాత్రమే పరిమితం చేయబడింది. స్త్రీల విషయంలో 'శీలం' అంటే పాతివ్రత్యాన్ని పాటించడం ఒక పురుషుని తోనే లైంగిక సంబంధం కలిగి ఉండడం. ఒక పురుషునికంటె ఎక్కువ మందితో లైంగిక సంబంధం ఉన్న స్త్రీని 'శీలం' లేనిదంటారు. 'పతిత' అంటారు. చెడిపోయిందంటారు. పురుషుడు ఎంతమంది స్త్రీలతో సంబంధం పెట్టుకున్నా చెడిపోయినవాడనరు. పైగా 'మంచి రసికుడు' అంటారు గొప్పగా. ఈ రకమైన ద్వంద్వనీతిని ఖండిస్తారు స్త్రీ వాదులు. స్త్రీల లైంగికత్వం (Sexuality)పై పురుషుల కంట్రోలుని ఎదిరిస్తారు. ఈ కవయిత్రి సమాజంలో ఉన్న ఈ ఈ ద్వంద్వనీతిని ఖండించి శీలాన్నీ, ఆస్తినీ స్త్రీ పురుషులకు సమానంగా వర్తింపించమంటున్నారు. ఆ కవయిత్రిది ఏ తాత్విక దృక్పథమైనా. తాను స్త్రీవాద కవయిత్రినని చెప్పుకోకపోయినా, ఈమెను 'హక్కులు - సమానత' కోరే తొలితరం స్త్రీవాద కవయిత్రిగా పేర్కొనవచ్చు.

## జయప్రభ కవిత్వం :

తాను ఫెమినిస్టుననీ, స్వేచ్ఛకోసం కవిత్వం రాస్తాను అనీ ప్రకటించుకున్న జయప్రభగారు స్త్రీలపై జరుగుతున్న అణిచివేతను వ్యతిరేకిస్తూ 1980లో 'సూర్యుడు కూడా ఉదయిస్తాడు,'[5] 1886లో 'యుద్ధోన్ముఖంగా,'[6] 1988 లో 'వామనుడి మూడోపాదం'[7] అనే కవితా సంకలనాలను వెలువరించారు. 'సూర్యుడు కూడా ఉదయిస్తాడు'లోని 'నా దేశంలో స్త్రీ' అనే ఖండికలో శతాబ్దాల తరబడి దోపిడికి, అణచివేతకూ గురవుతున్న స్త్రీల నుద్దేశించి, వారితో-

"శృంఖలాలు తెంచుకొని
అంధకారం చీల్చుకొని
తరాలుగా తరతరాలుగా
మిమ్మల్నణచి, మీ స్వేచ్ఛను దోచుకున్న
సంఘపు దౌర్జన్యంపై
తిరుగుబాటు చెయ్యండ"న్నారు.

'యుద్ధోన్ముఖంగా' కవితా సంకలనంలోని 'ప్రకృతిలో ప్రళయం' అనే కవితలో, పితృస్వామ్య వ్యవస్థ స్త్రీత్వానికి ఆపాదించిన దయ, క్షమ, శాంతం, సహనం

అనే లక్షణాల్ని వదలి 'సమానత్వ సాధనకై పేలే ఫిరంగిగా' ఒక్కసారి కను లెత్తి చూడమన్నారు.

సైమన్ ది బోవా "One is not born but rather made a woman"[8] అని చెప్పిన విషయాన్ని వ్యాఖ్యానించినట్లుగా 'విచ్చుకత్తులు' అనే కవిత రాశారు. ఇందులో మన సంస్కృతిలో ఒక స్త్రీ ఎలా తయారు చెయ్యబడు తున్నదో వివరించారు.

మాతృస్వామ్య వ్యవస్థలో స్త్రీ స్వయం వ్యక్తిత్వంతో, ఆత్మగౌరవంతో, స్వశక్తితో ఏవిధంగా ఉండేదో, పితృస్వామ్య వ్యవస్థ వేదాలూ, శాస్త్రాలూ సృష్టించి స్త్రీకి నీతులు బోధించీ, పాతివ్రత్యాన్ని విధించీ ఆమె స్వేచ్ఛ హరించి ఎలా నిస్సారం చేసిందో తెలిపే కవిత 'మానని'. ఇందులో ఈ పితృస్వామ్య వ్యవస్థ స్త్రీని సతీసహగమనంతో, కన్యాశుల్కంతో, నిర్బంధ వైధవ్యంతో, వర కట్నంతో, బలవంతపు పెళ్ళితో బలి తీసుకున్న తీరుని వివరించారు. స్త్రీకి ఆమె శరీరంపై, ఆమె సౌందర్యంపై, ఆమె అలంకారాలపై, ఆమె మనసుపై, ఆమె మనుగడపై ఆమెకే హక్కు లేకుండా చేసి వ్యక్తిగా గుర్తించలేదని ఆవేదన వ్యక్తం చేశారు. నేటి స్త్రీవాదులు తమ శరీరం మీద, తమ మనసుమీద సంపూ ర్ణాధికారాన్ని కోరుతున్నారు. స్త్రీవాద కవయిత్రిగా తాను చైతన్య వెల్లువై-తనని హింసించిన వేదాల, శాస్త్రాలపైన యుద్ధం ప్రకటిస్తున్నది.

"నా స్వాతంత్ర్య సాధనకై
సాటి స్త్రీలతో చేతులు కలిపి
పిడికిలి బిగిస్తున్నాను" అంటున్నది. ఈ చివరి వాక్యంలో

కవయిత్రి స్త్రీ విముక్తికి సామూహిక పోరాటం అవసరమని తెలిపారు.

'వామనుడి మూడోపాదం' కవితా సంకలనంలో స్త్రీలను సీతగానో, సావిత్రిగానో, అనసూయగానో, అరుంధతిగానో తప్ప బతకలేని వాళ్ళని చేసిన సమాజాన్ని 'ప్రసరిస్తున్న ఎడారులం' అనే కవితలో ఎత్తిచూపారు. పాతివ్రత్యం స్త్రీలకు మాత్రమే పరిమితం చేయబడి పురుషులు స్వేచ్ఛగా ఉండటాన్ని వ్యతిరే కించారు. మొగుడి నీడగా తప్ప స్వంత అస్తిత్వం, వ్యక్తిత్వం లేనివాళ్ళను చేసిన ఈ వ్యవస్థను అధిక్షేపించారు. పురుషుడికి తల్లిగానో, చెల్లిగానో, భార్య

గానో తప్ప అస్తిత్వం లేకపోవటాన్ని నేటి ఫెమినిస్టులు ప్రశ్నిస్తున్నారు. స్త్రీలకు వ్యక్తిగా గుర్తింపును కోరుతున్నారు.

నేటి సమాజంలో ఉన్న పురుషాధిపత్యాన్ని 'వామనుడి మూడోపాదం'గా 'పైట'గా సింబలైజ్ చేసి 'వామనుడి మూడోపాదం', 'పైటను తగలెయ్యాలి' అనే కవితలు రాశారు జయప్రభగారు. తానూ మనిషేనన్న భావాన్ని మరపించి, తనని నడిచే శవంగా మారుస్తున్న పైటను (పురుషాధిపత్యాన్ని) తగలెయ్యాలంటారు కవయిత్రి 'వామనుడి మూడో పాదం'లో—

"పెరుగుతున్న ప్రతీదశలో
మగతనం అనే క్రూరమృగం
కాటువేస్తోంద"న్నారు.

ఈ పురుషాధిపత్యం స్వరూపం ఏమిటి? పురుషులు స్త్రీలను ఎందుకు అణచివేస్తున్నారు? అనే అంశాలను పరిశీలిస్తే, పురుషులెవ్వరూ పుట్టుకతో స్త్రీలను అణిచివేసే స్వభావం కలిగిఉండక, పెరుగుతున్న దశలో సమాజంలోని జెండర్ విధానం సృష్టించిన పురుషత్వం అనే భావాలకు లోనై, వ్యవస్థ యిచ్చిన అధికారంతో స్త్రీలను అణిచివేసే వారుగా తయారవుతున్నారని తెలుస్తుంది. "The defining theme of that whole is the male pursuit of control over women's sexuality-men not as individuals nor as biological beings but as a gender group characterised by maleness as socially constructed" అని అన్నారు. Catharine A Mackinnon గారు.[9] పురుషాధిపత్యం ఈ వర్గ సమూహంలో ఏ ఒక్క-వర్గానికో పరిమితం కాలేదు. అన్ని వర్గాల పురుషులూ స్త్రీలపై ఆధిపత్యాన్ని చెలాయిస్తూనే ఉన్నారు. ఈ విషయం 'చూపులు' అన్న కవితలోని—

"ఆ కళ్ళలో
లక్ష వర్గాలున్నాయి
కాని చూపులకి మాత్రం వర్గవిభేదాలు లేవు" అన్న పాదాల వల్ల తెలుస్తోంది. 'వామనుడి మూడోపాదం' కవితను విమర్శిస్తూ కలువకొలను ధాంమోహన్‌రాజు గారు "కల్లార్ జాతి ఆచారం పట్ల జయప్రభగారి స్పందన

న్యాయమైనది. ఐతే, ఆమె దాన్ని 'వామనుడి మూడోపాదం'గా వర్ణించడం అతిశయోక్తి కాదా? అసలు వామనుడి మూడోపాదం వర్గవ్యవస్థ. దాన్ని వదలి ఆమె వర్గ సమాజంలోని ఒక పెదధోరణిని హైలైట్ చెయ్యడానికి పూనుకున్నారు"10 అని అన్నారు. అసలు వామనుడి మూడోపాదం వర్గవ్యవస్థే అయినా, పురుషాధిపత్యాన్ని కూడా సోషలిస్ట్ ఫెమినిస్టులు ఆర్థిక పునాదిలో భాగంగానే చూస్తారు. అందువల్ల జయప్రభగారు పురుషాధిపత్యాన్ని కూడా వామనుడి మూడోపాదంగానే పరిగణించారు. పురుషాధిపత్యం దోపిడీ వ్యవస్థవల్ల, ఆ వ్యవస్థలోని సంస్కృతి వల్ల ఏర్పడింది. ఈ పురుషాధిపత్యం నశించాలంటే ముందుగా దోపిడీ వ్యవస్థలోని ఆర్థిక పునాదిలో మార్పు రావాలి. దానితోపాటు ఉపరితలంలోని సంస్కృతిలో మార్పు రావాలి.

'ప్రతిచర్యగా' అనే కవితలో జయప్రభ గారు స్త్రీలని యుగాలనించీ చీకట్లోనే ఉంచిన పితృస్వామ్య సంస్కృతిలోని ధర్మశాస్త్రాలనూ, సాహిత్యాన్నీ, భాషలోని పదజాలాన్నీ సమూలంగా పెకలించడానికి ఉద్యమించమని ప్రబోధం చేశారు. ఈ కవితను విమర్శిస్తూ కలవకొలను రాంమోహన్ రాజుగారు "స్త్రీలను బానిసలు చేసిన అనేక ధర్మాలను అన్యాయాలని ప్రశ్నిస్తూ 'ప్రతిచర్యగా' అన్న కవిత రాసిన జయప్రభగారు ఉపరితలాన్నే తప్ప పునాదిని ప్రశ్నించలేదు"11 అని అన్నారు. పునాదిని ప్రశ్నించనిమాట వాస్తవమే అయినా ఉపరితలాన్ని కూడా మార్చాల్సిన అవసరం ఉంది. పునాది మారిన వెంటనే అంతవేగంగా ఉపరితలం మారదు. కాబట్టి, ఉపరితలాన్ని ప్రశ్నించటం కూడా అవసరమే. అయితే, పురుషాధిపత్యాన్ని నశించేట్లు చేసే క్రమంలో జయప్రభగారు స్త్రీ సమస్యలకు మూలకారణమైన వర్గవ్యవస్థను గుర్తించినట్లు కనబడదు. స్త్రీల అణిచివేతకు కారణం పురుషుడు కాదు; వ్యవస్థ అని ఎవరైనా పురుషులు అంటే-

"ఆ వ్యవస్థ మీ అమూల్యసృష్టి
ఈ సంఘం మీది అధికారం మీది
ఈ ఆచారాలు మీ ధర్మశాస్త్రాలకు నకళ్ళు" అని సమాజంలో ఉన్న పురుషాధిపత్యాన్ని ఎత్తిచూపుతారు కవయిత్రి. ఈ పురుషాధిపత్యం నశించాలంటే 'సాటి స్త్రీలతో చేతులు కలిపి పిడికిలి బిగిస్తే' సరిపోదు. పీడిత జనపోరాటంతో చేతులు కలపాలి. "అడవిలోని ఉద్యమం నగరాలకి ప్రాకడానికి/నేనూ.... నీతోనే" అని విప్లవోద్యమంతో మమేకమై-

"పీడిత జన పట్టాభిషేకం సమతాభావం విస్తరించడం కోసం
మానవతా విలువల కోసం
మా కవిత్వం"[12] అన్న జయప్రభగారికి ఈ అవగాహన లేదని అనుకోలేం. ఒకప్పుడు మార్క్సిస్టు ఉద్యమంలో పనిచేసి, ఆ ఉద్యమంపై అసంతృప్తితో బయటికివచ్చి సోషలిస్ట్ ఫెమినిస్ట్‌గా మారినందువల్ల జయప్రభగారిలో ఈ మార్పు వచ్చి ఉంటుంది.

## కొండేపూడి నిర్మల కవిత్వం :

సమాజంలో జరుగుతున్న వివిధ సంఘటనలకు స్పందిస్తూ కొండేపూడి నిర్మలగారు 1986 లో 'సందిగ్ధ సంధ్య'[13], 1990 లో 'నడిచే గాయాలు'[14] అనే కవితా సంకలనాలు ప్రచురించారు. స్త్రీల మనోభావాలను స్త్రీలు ఎంత సహజంగా, ఎంత గాఢంగా వర్ణించగలరో అంత సహజంగా, అంత గాఢంగా వర్ణించడం నిర్మలగారి ప్రత్యేకత. అట్లాగని ఈమె కేవలం స్త్రీల గురించి మాత్రమే రాయలేదు. తన కవిత్వానికి ముందుమాట చెప్తూ నిర్మలగారు "ఈ దశలో స్త్రీ మానసిక, శారీరక అనుభూతుల్ని, గాయాల్ని ఎక్కువగా రాసినమాట నిజమే. అంతమాత్రాన అదిమాత్రమే నా లక్ష్యంకాదు. ఈ కన్నీటి చుక్క ఆడదా మగదా అనే ప్రసక్తి లేద''న్నారు.[15] 'నడిచే గాయాలు' లో వేశ్యల శారీరక, మానసిక హింసనూ, 'లేబర్ రూం'లో ప్రసవ సమయంలో ఒక స్త్రీపడే శారీరక బాధనూ, 'మదర్ సీరియస్'లో ఒక వృద్ధస్త్రీ ఆవేదననూ ఇంతవరకు ఎవరూ వర్ణించనంత లోతుగా, గాఢంగా, అద్భుతంగా వర్ణించారు.

'ఆవిడెప్పుడూ సిద్ధంగా ఉంటుంది' కవితలో స్త్రీ నవ్వుమీదా, నడకమీదా, నిద్రమీదా, మెలకువమీదా, అలంకారంమీదా, ఆలోచనమీదా పురుషుడు వేసే నిఘానీ, ''మరణ వాజ్మూలం'' కవితలో ఇలా ఏడువు, అలా నడువు, ఇలా నవ్వు అంటూ పురుషుడు వేసే అచ్చుమిషను రాపిడినీ గుర్తించారు కవయిత్రి. భిన్న శారీరక నిర్మాణాలతో పుట్టిన స్త్రీ పురుషులకు స్త్రీత్వ, పురుషత్వ లక్షణాలను నిర్దేశించిన జండర్ విధానాన్ని తెలిపారు. మానవజాతి వికాసం కోసం ఉపయోగించాల్సిన సైన్సును అంగుళమంతైనా లేని ఆడశిశువును నాశనం చెయ్యడానికి ఉపయోగిస్తున్నారు. ఈ అమ్నియో సింథసిస్ విధానాన్ని వ్యతిరేకిస్తూ

నిర్మలగారు ''యుద్ధశిశువు'' అనే కవిత రాశారు. యుద్ధశిశువు ఈ వ్యవస్థ నుద్దేశించి మీ సైన్సులూ, గణితాలూ అన్నీ—

''ఆటవికమైన శిశు హత్యల్ని
దశలవారిగా సులభతరం చెయ్యడానికేనంటే
మీ మరుగుజ్జుతనం ఏమిటో తెలుస్తుంది
నేనెంత గొప్ప శత్రువునో కూడా అర్థమవుతోం''దని అంటున్నది.

ఈ చివరి పాదం చదివితే ఆడశిశువుని ఈ సమాజం ఎంత నీచంగా చూస్తుందో అర్థమవుతుంది. ఈ కవితలో స్త్రీజాతిని అంతం చేస్తున్న వ్యవస్థపట్ల కవయిత్రికి ఉన్న తీవ్రమైన వ్యతిరేకత వ్యక్తమవుతోంది. నిర్మలగారికి పురుషాధిపత్యం పట్ల వ్యతిరేకత ఉందేగాని దాన్ని నాశనంచేసే క్రమం తెలియదు. ''కప్పల తక్కెడ''లో కుటుంబంలోనూ, సమాజంలోనూ స్త్రీలపై జరుగుతున్న లైంగిక అణిచివేతను వివరిస్తూ, ఆ అణచివేతను ఎదుర్కోడానికి కావలసిన విజ్ఞానాన్ని బాలికలకు పాఠ్యాంశాల ద్వారా అందజేయాలంటారు. ఈ విధంగా చేయడం వల్ల స్త్రీలపై అణచివేత నశిస్తుదా? ఈ సందేహం కూడా వచ్చింది కవయిత్రికి. బాలికల్లో జాగృతిని కలిగించడం వల్ల అణిచివేత కొంతవరకు తగ్గవచ్చు. కాని, పురుషులు చేసే అణచివేత పూర్తిగా నశించాలంటే ఈ వ్యవస్థ పూర్తిగా మారాలి. స్త్రీపురుషులు సమానులుగా ఉండే వ్యవస్థ రావాలి. దానికోసం ఏం చెయ్యాలో చెప్పలేదు కవయిత్రి. 1984 లో రాసిన 'వధూగీతం' కవితలో నవవధువు భావనగా -

"చార్మినార్ ఎత్తులూ, బాదర్ ఘాట్ లోతులూ
కిరసనాయిలూ, మృత్యుఛాయలూ
అన్నీ తెలిసిన నరకం నుండి
నా ఏమీతెలీనితనాన్ని రక్షించండ"న్నారు.

స్త్రీలు పలురకాలుగా ఆత్మహత్యలకు పాల్పడడానికి పురుషాధిక్య వ్యవస్థే కారణం. అయితే దాన్ని ఎట్లా ఎదుర్కోవాలో తెలీక 'నా ఏమీ తెలీనితనాన్ని రక్షించండి" అంటున్నారు కవయిత్రి. 1990 లో రాసిన 'గోడలు' కవితలో -

"కొట్టిన, కోసిన, వాత పెట్టిన మనశ్శరీరాల మీద
శరీరాలు చావకుండా కదుముకట్టిన వ్యక్తిగతవిషయాలమీద
ఈగవాలకుండా కాపలా కాస్తున్న గోడలను" గుర్తించారు. అంతేకాదు, గోడలమధ్య నలిగి నజ్జయిన జీవితాల్ని లాలిద్దామనుకున్నారు. కాని, "చిత్రంగా నా చేతులమీదా గోడలే" అంటారు. ఆ గోడల్ని ఎలా పగులగొట్టాలో నిర్మల గారికి తెలియదు. "మాకు గోడలు లేవు. గోడల్ని పగులగొట్టడమే మా పని" అనే స్థాయికి ఈ కవయిత్రి ఎదగాల్సి ఉంది. జయప్రభ గారి కవిత్వాన్నీ, నిర్మలగారి కవిత్వాన్నీ పోల్చినట్లయితే, వారిద్దరి కవిత్వం మధ్య ఆమె 'పైట'కూ ఈమె 'ఓణీ'కి ఉన్నంత భేదం ఉంది.

## ఈశ్వరి కవిత్వం :

ఈశ్వరిగారిని బతుకు బాధల్లోంచి వచ్చిన ఫెమినిస్టు కవయిత్రిగా 'చేరా' గారు తెలుగు పాఠకులకు పరిచయం చేశారు.16 'ఈశ్వరికోసం సాహిత్యమైత్రి'17 అనే పేరుతో ఈశ్వరిగారి మిత్రులు కొందరు పుస్తకం అచ్చేశారు. ఈ కవయిత్రి సేల్స్‌గర్ల్‌గా పనిచేసిన అనుభవంతో 'నిన్ను నీవు ప్రశ్నించుకోకు' అనే కవిత రాశారు. సేల్స్‌గర్ల్ అంటే కొందరికి చులకన. కొందరికి కాలక్షేపం. సేల్స్ గర్ల్స్ జీవితంలో నిస్సారాన్నీ నిస్సహాయతనీ మన కళ్ళముందుంచారు. 'కదనం' కవితలో విప్లవానికి అంకితమైన కవయిత్రి కనిపిస్తారు. ఈ కవితలో-

"నేను యుద్ధసన్నద్ధమై తుప్పుపట్టిన
నా ఆయుధాన్ని పదును పెట్టి
మెరుగులుదిద్ది, చేతిలోకి
తీసుకుని నడుస్తున్నా
సామాజిక కదనరంగానికి" అన్నారు.

'మంచి రోజులు' కవితలో అమ్నియో సింథసిస్ (లింగ నిర్ధారణ పరీక్ష) ద్వారా స్త్రీ జాతిని నాశనం చేస్తున్న సమాజాన్ని వ్యంగ్యంగా విమర్శించారు. "అమ్మకు నీ జాతినే/కంటోందని నాన్ననుండి/విదిలింపులే ఉండవురా చిన్నా" అంటారు కవయిత్రి. నాన్న విదిలింపులు ఈ పితృ స్వామ్య సమాజానివే. తన జీవితాన్నంతా ప్రతిబింబించి 'నివేదన' కవిత రాశారు ఈశ్వరిగారు. ఇందులో,

తన జీవితాన్ని నాశనం చేసిన వ్యక్తిని "వేళ్ళూనుకుపోయిన విషవృక్షానివి" అని అన్నారు. ఈ విష వృక్షం పురుషాధిపత్యమే. ఈ విష వృక్షానికి దాన్ని పెంచి పోషించే రక్షణ కవచం (పెట్టుబడిదారీ వ్యవస్థ) ఉన్నంత కాలం చావులేదని గుర్తించారు కాని, దాన్ని ఎదుర్కోలేక నిష్క్రమణే ప్రతీకారమని తలచి అంతిమ పయనం సాగించారు. ఏవో సంస్కరణలు చెయ్యడంవల్ల పురుషాధిపత్యం నశించదని తెలుసుకొన్న కవయిత్రి—

"నే నంతమౌతూ అర్థించిపోతున్నా
కనీసం నిన్నయినా అంతం చేయమని
నా తరువాత వాళ్ళయినా
నీ తరువాత వాళ్ళని అంతం చేయాలని" అన్నారు.

## విమల కవిత్వం :

"అడవి నా రక్షణ కవచం, ఆయుధం నా దిక్సూచి" అంటూ అడవితో అడవిలోని అన్నలతో మమేకమైన విప్లవ కవయిత్రి విమలగారు. స్త్రీ సమస్యలకూ, విప్లవోద్యమానికి ఉన్న సంబంధాన్ని అవగాహన చేసుకొని శాస్త్రీయమైన పరిష్కార మార్గాన్ని సూచించటం విమలగారి విశిష్టత. 1980 - 1988 మధ్య ఈమె రాసిన కవితలను 'అడవి ఉప్పొంగిన రాత్రి'[18] పేరుతో విరసం సిటీ యూనిట్ వారు ప్రచురించారు.

'సౌందర్యాత్మక హింస' కవితలో స్త్రీ అందానికి సంబంధించిన సమస్యను తీసుకొని దానికి పరిష్కారం చూపారు. స్త్రీలకు అలంకరించుకోవాలనే కోరిక పుట్టుకతోనే వస్తుందనడం నిజంకాదు. ఏ వ్యక్తికైనా పుట్టుకతోనే ఏ కోరికలూ, అభిప్రాయాలూ, విశ్వాసాలూ ఏర్పడవు. పెరుగుతున్న దశలో సమాజం ప్రభావం వల్లనే ఏర్పడతాయి. పురుషుల కంటికి అందంగా కనబడటం నేడు స్త్రీల జీవితానికి అవసరమవుతోంది. చాలమంది స్త్రీల ఆర్థిక, సాంఘిక భద్రతకున్న ఒకే ఒక అవకాశం పెళ్ళిలో వాళ్ళ లైంగికత్వాన్ని అమ్ముకోవటం. దానికోసం స్త్రీలు తమ అలంకరణలకీ, దుస్తులకీ బోలెడంత డబ్బూ, టైమూ పెట్టాల్సి వస్తోంది. ఇంత చేసినా వాళ్ళ లైంగికత్వం వాళ్ళకు ఆనందాన్నిచ్చేదిగా కాక పురుషులకు ఆనందాన్నిచ్చేదిగా ఉంటున్నది. స్త్రీలు కూడా తమ శరీరాలను

పురుషులు తమ అవయవాల చుట్టూ అల్లిన మాయాజాలంగుండానే చూసుకుంటున్నారు. తప్పనిసరి పరిస్థితుల్లో స్త్రీలు తమను తామే హింసించుకుంటున్నారు. సమాజం స్త్రీలను సౌందర్యానికి ఎంతగా బానిసల్ని చేసిందంటే -

"ఈ స్వచ్ఛంద హింస

మన సహజాతమని నమ్మేటంతగా" అంటారు కవయిత్రి - రకరకాల పరిస్థితుల్లో స్త్రీలకు తప్పనిసరి అవుతున్న సౌందర్యాన్ని విమలగారు "నిర్బంధ సౌందర్యాత్మక హింస" అంటారు. ఇలాంటి నిర్బంధ సౌందర్యాత్మక హింసను ద్వేషిస్తూ "అందాన్ని ఖరీదు చేయలేని కోట్లమంది స్త్రీల/అందహీనతని మనం ప్రేమిద్దాం/శ్రమ సౌందర్యాన్ని, మానవ విలువల్ని ప్రేమిద్దాం" అంటారు.

విమల గారు స్త్రీల అణిచివేతకు మూల కారణాలు తెలుసుకొని స్త్రీ విముక్తికి శాస్త్రీయమైన పరిష్కార మార్గాన్ని సూచించిన కవిత 'వంటిల్లు.' గిరీశం, "దేవుడు ఆడవాళ్ళ నెందుకు చేశాడు?" అని ప్రశ్నిస్తే వేంకటేశం లాంటి వెర్రి బాగులవాడు కూడా "వంట చెయ్యడానికి" అని ఠక్కున జవాబు చెప్పాడంటే స్త్రీ వంటింటిలో ఎంతగా నిర్బంధించబడిందో అర్థం చేసుకోవచ్చు.

స్వంత ఆస్తి ఏర్పడినప్పటినుండి జరిగిన శ్రమవిభజనలో స్త్రీలు సామాజిక ఉత్పత్తికి దూరమై కేవలం వంటింటికే పరిమితం చెయ్యబడ్డారు. ఈ విషయాన్ని "మా అమ్మ, మా అమ్మమ్మ, ఇంట్లో అమ్మలంతా ఇక్కడే స్త్రీలయ్యారట" అన్న ఒక్క వాక్యంలో ప్రదర్శించారు కవయిత్రి. జెండర్ విధానంలో స్త్రీత్వానికి వంటింటితనం కూడా ఒక అంశమైన విషయాన్ని తెలిపారు. ఈ వంటింటితనం స్త్రీత్వానికి ఆపాదించబడిందేగాని సహజమైంది కాదు! స్త్రీ జీవితం వంట గదికి ఎంతగా పరిమితమైందో వంట గదికి, స్త్రీకి అభేదం చెప్పడం ద్వారా తెలుపుతూ "అసలు మా అమ్మే నడుస్తున్న వంటగదిలా ఉంటుం"దంటారు. ఈ వంటింటి చాకిరీలో ఆమె చేతులు అరిగిపోయి, ఆమె వంటింట్లో గరిటెగానో, పెనంగానో లేక ఒక పరికరంగానో మారిందంటారు. వంటింటి చాకిరంతా స్త్రీది. ఆ స్త్రీపై పెత్తనమంగా పురుషునిదిగానే వుందనే విషయాన్ని --

"ఈ వంటింటి సామ్రాజ్యానికి మా అమ్మే రాణి

అయినా చివరకు వంటింటి గిన్నెలన్నిటిపైనా నాన్న పేరే" అని వ్యంగ్యంగా సూచించారు. స్త్రీలమీద జరిగే పురుషాధిపత్యం ఏ ఒక్క వర్గానికి చెందిన స్త్రీలకో పరిమితం కాదు. వర్గభేదం లేకుండా స్త్రీలందరూ పురుషాధిపత్యం కింద నలుగుతున్నారన్న విషయాన్ని "తానో మంచి వంటింట్లో (ధనికవర్గం ఇంట్లో) పడినా ఇంకా గిన్నెలపై పేర్లు మాత్రం నా భర్తవే" అనడం ద్వారా సూచిందారు. ధనిక వర్గంలో కూడా స్త్రీల పరిస్థితి అలంకరించిన వంటగదులే. చేసే పని విధానంలో మార్పేగాని పనిమాత్రం మారదు. వర్గభేదం లేకుండా స్త్రీలందరూ అనుభవిస్తున్న పురుషాధిపత్యం నశించాలంటే, స్త్రీలందరూ వర్గభేదం లేకుండా ఏకం కావాలి. కాని అది జరగదు. ఎందుకంటే, ధనికవర్గపు స్త్రీలు సహజంగా తమ భర్తల/తండ్రుల లాగ దోపిడీ స్వభావాన్ని కలిగి ఉంటారే తప్ప శ్రామిక వర్గ స్త్రీలతో కలవరు. కాబట్టి ముందుగా వర్గభేదాలను రూపుమాపాలి. ఆ క్రమంలోనే అన్ని వర్గాల స్త్రీలూ కలిసి పురుషాధిపత్యాన్ని ఎదిరించాలి.

"వేరు వేరు స్వంత పొయిలను

పునాదులతో సహా తవ్విపోద్దాం రండి" అనడంలో వంటపనినీ, ఇంటి పనినీ సామాజికీకరణ (Socialization) చేయాలనీ, అందుకోసం ఇప్పుడున్న వ్యవస్థను ధ్వంసం చేయాలనీ కవయిత్రి ఉద్దేశ్యం. ఒంటరి వంటగదులు ఉండకుండా సామూహిక వంటశాలలు ఉండడం సాధ్యమయ్యేది సోషలిస్ట్ వ్యవస్థలోనే, అలాంటి వ్యవస్థను స్థాపించేందుకు ఇప్పుడున్న వ్యవస్థను ధ్వంసం చేద్దాం రండంటున్నారు కవయిత్రి. సోషలిస్ట్ వ్యవస్థలో ఇంటిపనిని సామాజికీకరణ చేసినా అక్కడ కూడా ఆ పని స్త్రీలకే పరిమితమైతే మళ్ళీ స్త్రీలే అణచివేతకు గురవుతారు. కాబట్టి ఆ పనిలో స్త్రీ పురుషులిద్దరూ భాగం పంచుకోవాలి. స్త్రీ విముక్తికీ, విప్లవోద్యమానికీ ఉన్న సంబంధాన్ని విమలగారు గ్రహించారు కనుకే వంటిల్లు కవితలో, పీడిత జనవిముక్తి జరిగే క్రమంలోనే స్త్రీ విముక్తి అవుతుందని తెలిపారు. 'The emancipation of women becomes possible only when women are enabled to take part in production on a large scale and when domestic duties require their attention only to a minor degree"[19] అని ఎంగెల్స్—

"If we do not draw women into public activity, into the militia, into a political life, if we do not tear women away from the deadening atmosphere of house hold and kitchen then it is Impossible to secure real freedom, it is impossible even to build democracy, let alone socialism"[20] అని లెనిన్ వేరువేరు సందర్భాల్లో చెప్పిన మాటల్నిబట్టి స్త్రీ విముక్తి కావాలంటే ఆమె ఇంటిపనీ, వంటపనీ తగ్గించి సామాజిక ఉత్పత్తిలోకీ, ప్రజా కార్యక్రమాలలోకీ, రాజకీయాలలోకీ ప్రవేశించాలని తెలుస్తుంది. విమలగారు ఈ అవగాహన కలిగిన కవయిత్రి కాబట్టే వేరువేరు స్వంతపొయిలను పునాదులతో సహా తవ్విపోద్దాం రండన్నారు.

కవితా సంకలనాలే కాకుండా విడిగా వివిధ పత్రికల్లో వచ్చిన కవిత్వాన్ని పరిశీలిస్తే, స్త్రీల సమస్యలపై కవిత్వం బలంగానే వస్తున్నట్లు తెలుస్తుంది. సావిత్రిగారు 'బందిపోట్లు'[21] కవితలో పురుషాధిపత్యాన్నంతా కుప్పపోసినట్లు చూపించారు. పాఠం ఒప్పచెప్పకపోతే 'పెళ్ళి' చేస్తానని పంతులుగారన్నప్పుడూ, ఆఫీసులో 'నా మొగుడు'న్నాడు అని అన్నయ్య అన్నప్పుడూ, వాడికేం 'మగమహారాజు' అని ఆడామగా వాగినప్పుడూ కవయిత్రికి అర్థమైపోయింది- "పెళ్ళంటే పెద్ద శిక్షని/మొగుడంటే స్వేచ్ఛా భక్షకుడని." పెళ్ళి అనేది స్త్రీ జీవితంలో తప్పనిసరి అవుతున్నది. పురుషుడికి పెళ్ళి జరగకపోతే 'పెళ్ళి చేసుకోలేదు' అంటారు. స్త్రీకి పెళ్ళి జరగకపోతే 'పెళ్ళి కాలేదు' అంటారు. స్త్రీకి పెళ్ళి జరగటం ఎన్ని కష్టాలతో కూడుకున్నదో మనకు తెలిసిన విషయమే. డబ్బు పెట్టి మరీ చేసుకున్న పెళ్ళివల్ల స్త్రీకి ఒరిగేదేమిటంటే తనని హింసించేందుకు పురుషునికి లైసెన్స్ ఇవ్వటమే. పెళ్ళివల్ల స్త్రీకి లభించే మరి రెండు సంకెళ్ళు యింటి చాకిరీ, పిల్లల పెంపకం. నిర్బంధాలూ, ఆంక్షలూ ఎలాగు తప్పవు. ఇంతకంటే పెద్ద శిక్షేం వుంటుంది స్త్రీకి? పంతులుగారు 'పెళ్ళి' చేస్తాను అనడంలో ఇంత అర్థం దాగివుంది. అబ్బూరి ఛాయాదేవిగారు 'విన్నావా'[22] అనే కవితలో స్త్రీపట్ల ఈ సమాజం ఎలా ప్రవర్తిస్తోందో తెలిపారు. సమాజం స్త్రీని అనుక్షణం "నువ్వు ఆడదానివి. గీత దాటకూడని దానివి, మచ్చపడితే మాయని దానివి" అంటుందంటారు. ఈ గీతాలూ, మచ్చలూ స్త్రీకేగాని పురుషునికి లేవంటుంది ఈ సమాజం.

ఓ సాయంత్రం విజయవాడ సెంటర్లో మెళ్ళో వేశ్యల బోర్డు కట్టి ఊరే గించిన సంఘటనకు స్పందించి మంటసాల నిర్మలగారు "ఏ కాల్ గర్ల్స్ మోనో లాగ్'23 రాశారు. ఈ కవితలో పడుపుకత్తె స్వగతాన్ని తన స్వరంతో విని పించారు.

'వేల వేల వీర్యాల వర్షాన్ని
కళ్ళు మూసుకునైనా భరిస్తున్నదాన్ని"

అంటూ వేశ్య బతుకులోని జుగుప్సనీ ఓర్మినీ ప్రదర్శించారు. ఈ వేశ్యకు తప్పుచేస్తున్నాననే ఆత్మన్యూనతా భావం లేకపోగా 'మైల్డ్ ఇగో' కలిగి ఉండటం గుర్తించదగింది. ఒక కవయిత్రి ఇట్లా తనను తాను వేశ్యగా రూపించుకొని ఉత్తమ పురుషలో కవిత్వం రాయటం స్త్రీలు కవిత్వం రాయడంలో తీసుకున్న స్వేచ్ఛకూ, విర్భీకతకూ నిదర్శనం.

హైదరాబాదులోని మెహిందీ బజారులో వేశ్యలమీద పోలీసులు జరిపిన బీభత్సాన్నీ, అక్కడి వేశ్యల బాధల్నీ విన్న ఓల్గాగారు మెహిందీ స్త్రీల తరపున-

"ఓ మగమద మృగాల్లారా
మీరు మీ ఇళ్ళలో చావండి
మీ తల్లుల ఒళ్ళలో చావండి
.... .... .... ....
చావటానికి మా దగ్గరకు రాకండి
బతకడానికి నానా చావూ చస్తున్నవాళ్ళం"24 అని విజ్ఞప్తి చేశారు.

**Male Chavanist Pigs** అనే మాటకు అనువాదంలాగా 'మగమద మృగాల్లారా' అని కవయిత్రి సంబోధించారు. కవయిత్రులు పదాల ఎన్నికలో తీసుకున్న స్వేచ్ఛకు నిదర్శనం యిది. చివరి పంక్తిలో కవయిత్రి బతకలేక వేశ్యలుగా మారుతున్న స్త్రీల ఆర్తిని వినిపించారు. ఈ కవయిత్రులేకాక ఇంకా చాలామంది కవయిత్రులు స్త్రీల సమస్యలపై కవిత్వం రాస్తున్నారు. వీళ్ళలో చాలామందికి స్త్రీల సమస్యలపట్ల సానుభూతి ఉందేగాని సరియైన అవగాహన లేదు. ఉదా:- మందరపు హైమావతిగారు 'సర్పపరిష్వంగం'25 కవితలో ఒక

స్త్రీ శృంగార సమయంలో తన భర్త ఆమెను జీతం వచ్చిందా అని అడిగినప్పుడు అతన్ని అసహ్యించుకుంటుంది. విడాకులివ్వా లనుకుంటుంది. కాని, తాను భారతీయ స్త్రీ కావడంవల్ల ఆ పని చేయలేకపోతున్నా నంటుంది. కవయిత్రి ఈ విధంగా సంప్రదాయానికి లొంగటం పురుషాధిపత్యాన్ని వ్యతిరేకించలేక పోవటమే. మరొక కవయిత్రి పాటిబండ్ల రజనిగారు 'అబార్షన్ స్టేట్ మెంట్'[26] కవితలో అబార్షన్ చేయించుకోవడం అవసరంగా భావిస్తూనే, అబార్షన్ చేయించుకున్నందుకు బాధపడుతుంది. (పిల్లలు కావాలో వొద్దో నిర్ణయించు కోవడం, ఎప్పుడు కావాలో వొద్దో నిర్ణయించుకోవడం స్త్రీలకే హక్కు ఉండా లంటారు నేటి స్త్రీవాదులు.) వైద్యశాస్త్రం కనిపెట్టిన సౌకర్యాన్ని తన కోరిక పైనే వాడుకుంటూ వాళ్ళ ముఖంమీద ఉమ్మెయ్యాలనుకుంటుంది కవయిత్రి. ఒక విషయంలో వైరుధ్యమున్న భావాలను ప్రకటించడం సమస్యపట్ల అవగాహనా లోపాన్ని సూచిస్తున్నది. రావులపల్లి సునీత, చంద్రమల్లిక, ఆర్. శశికళ, కె. గీత, కె. వరలక్ష్మి, కోట్ల వనజాత, పుట్ల హేమలత, కవితాభారతి మొ॥వారు స్త్రీ సమస్యలపై మంచి కవితలు రాస్తున్నారు.

1980 నుండి కవులు కూడా స్త్రీ సమస్యలపై సంపూర్ణ సానుభూతితో కవిత్వం రాస్తున్నారు. ముఖ్యంగా శిఖామణి (పూలబజారు), అరణ్యకృష్ణ (వేట, మెహబూబ్ కీ మెహిందీ), ఎండ్లూరి సుధాకర్ (షమ్మా), జలదంకి సుధాకర్ (ఎర్రబడని మెహిందీ), ఆశారాజు (అద్దంలో ప్రతిబింబం), శివారెడ్డి, అలిసెట్టి ప్రభాకర్ (వేశ్య, విషాదసాక్షాత్కారం, ఎవ్వరమ్మా నువ్వు), కొప్పుల సింహాద్రి (జెనెటిక్ ఇంజనీరింగ్) మొ॥వారి కవితలు స్త్రీ సమస్యలను ప్రతిభావంతంగా చిత్రించాయి. వీరిలో అలిసెట్టి ప్రభాకర్‌గారు స్త్రీ విముక్తి ఉద్యమం వర్గ పోరాటంతో కలిసి సాగాలని సూచిస్తూ-

"ఈ ఆయుధాల నీడకింద
సేద తీర్చుకో....
మా ఆశయాల సాధనలో
మమేకమైపో...." అన్నారు.[27]

ఈ దశాబ్దంలో స్త్రీల సమస్యలపై కవిత్వం రాసిన కవుల్లో కవయిత్రుల కంటే ప్రతిభావంతంగా రాసిన కవులున్నారు ఆరణ్యకృష్ణగారి 'మెహబూబ్‌కీ మెహిందీ' అందుకు మంచి ఉదాహరణ.

ఇదివరకటి కవిత్వంలో అగ్గిపుల్లలు, సబ్బు బిళ్లలు, కుక్కపిల్లలు కవితా వస్తువులైతే ఇటీవలి కవిత్వంలో వంటిళ్ళూ, పురిటిళ్ళూ; పైటలూ, ఓణీలూ, అంట్లగిన్నెలూ, అలుగ్గుడ్డలూ, పొయిలూ, పెనాలూ కవితా వస్తువులైనాయి. సర్కస్ పిల్లలూ, రికార్డింగ్ డాన్సర్‌లూ, ఎక్‌స్ట్రాలూ కవిత్వంలో స్థానం సంపాదించుకున్నారు.

పైన విశ్లేషించిన కవిత్వాన్ని పరిశీలిస్తే, రేవతీదేవిగారి కవిత్వం తొలి తరం స్త్రీ వాద ధోరణినీ, జయప్రభగారి కవిత్వం సోషలిస్ట్ ఫెమినిస్టు ధోరణినీ, ఈశ్వరి, విమల, అలిసెట్టి ప్రభాకర్‌గార్ల కవిత్వం మార్క్సిస్టు ఫెమినిస్టు ధోరణినీ, కొండేపూడి నిర్మలగారి కవిత్వం సైద్ధాంతిక ప్రాతిపదికలేని వ్యక్తిగత ధోరణినీ ప్రతిబింబిస్తున్నాయని తెలుస్తున్నది.

చివరగా శివారెడ్డిగారి పద్యాన్ని కోట్ చేస్తూ వ్యాసాన్ని ముగిస్తాను.

''ఇన్నాళ్ళనుంచి చావిట్లోనే వుంది
పుట్టినదగ్గరనుంచీ మేకుకు కట్టేయబడే వుంది
కోడెదూడ - బయటి ముఖం చూళ్ళేదు.
బయట కూడా కట్టేద్దామనే తీసుకొస్తుంటే
ఒక గుద్దు గుద్ది - ఎత్తిపడేసి
దేశాల మీద పడ్డది -
స్వేచ్ఛలో - స్వేచ్ఛగా - స్వేచ్ఛకై
కట్టేయటమంటే తెంచుకుపొమ్మనే
మేకునుగూడ పెళ్ళగించుకుపొమ్మనే
అణిచి పెట్టటమంటే - ఎదురుతిరగమనే

జన్మతః అణువుల్లో నిగూఢమైన
అసంకల్పిత ప్రతీకార చర్య ఇది''[28] (చర్య)

**జ్ఞాపికలు :**


1. కృష్ణకుమారి, నాయని, "20 వ శతాబ్దిలో తెలుగు కవిత్వం - స్త్రీలు" **20 వ శతాబ్దములో తెలుగు సాహిత్యము - మహిళలు,** హైదరాబాద్ : ఆం. ప్ర. సా. అకాడమీ. 1976. పేజీ. 5 లో ఉట్టంకించబడింది.
2. ,, ,, పేజి.6 లో ఉట్టంకించబడింది.
3. శివసాగర్; **ఉద్యమం నెలబాలుడు,** హనుమకొండ : సృజన ప్రచురణలు జనవరి 1983. పుట. 124.
4. రేవతీదేవి; **శిలాలోలిత,** తిరుపతి : ప్రియబాంధవి ప్రచురణలు 1981.
5. జయప్రభ; సూర్యనారాయణ, విశ్వనాథ; **సూర్యుడు కూడా ఉదయిస్తాడు,** హైదరాబాద్ : యువభారతి 1980.
6. జయప్రభ; **యుద్ధోన్ముఖంగా,** హైదరాబాద్ : స్వంత ప్రచురణ మార్చి 1986.
7. జయప్రభ; **వామనుడి మూడోపాదం,** హైదరాబాద్ : చైతన్య - తేజ పబ్లికేషన్స్ - మే 1988.
8. Simone de Beavoir; **The Second Sex.**
9. Catharine A Mackinnon; **Feminist Theouy** A critique of idealogy Ed. Nannerl O, Keohana, Michell Z Rosal and Barbara C, Gelpi, 1982. p. 3.
10. రాంమోహన్‌రాజు, కలువకొలను; "వామనుడి మూడోపాదం స్త్రీ పురుష సంబంధాలు" **మంజీర**
11. ,, ,, ,,
12. జయప్రభ; "యుద్ధోన్ముఖంగా" **యుద్ధోన్ముఖంగా,** హైదరాబాదు : స్వంత ప్రచురణ మార్చి 1986. పుట. 88.
13. నిర్మల, కొండేపూడి; **సందిగ్ధ సంధ్య,** విజయవాడ : స్వంత ప్రచురణ. 1988.
14. నిర్మల, కొండెపూడి; **నడిచేగాయాలు,** తిరుపూరు : స్వంత ప్రచురణ, ఏప్రిల్ 1990.

15. నిర్మల, కొండెపూడి; "ఒక్క-క్షణం" తిరువూరు : స్వంత ప్రచురణ, ఏప్రిల్ 1990.
16. చేరా; "బతుకు బాధల్లోంచి వచ్చిన ఫెమినిస్టు కవయిత్రి ఈశ్వరి" ఆంధ్రజ్యోతి (దిన).
17. ఈశ్వరి; ఈశ్వరికోసం సాహిత్యమైత్రి, విజయవాడ : ఈశ్వరిమిత్రులు. 1989
18. విమల; అడవి ఉప్పొంగిన రాత్రి, హైదరాబాద్ : విరసం సిటీ యూనిట్. 1990
19. Quoted by Guettle, Charnie; **Marxism and Feminism**, Canada; The women's press. 1974. p. 12.
20. Lenin, Letters Afar, Letter III. quoted by Kanak Mukarji in **Women's Emancipation movement in India**.
21. సావిత్రి; "బందిపోట్లు"
22. ఛాయాదేవి, అబ్బూరి; "విన్నావా" ఆంధ్రజ్యోతి (వార) 23-3-1984, పుట 9.
23. నిర్మల, ఘంటసాల; "ఏ కాల్‌గర్ల్స్ మోనోలాగ్"
24. ఓల్గా; "మెహిందీ స్త్రీల విజ్ఞప్తి"
25. హైమావతి, మందరపు; "సర్పపరిష్వంగం" ఆంధ్రజ్యోతి (వార)
26. రజని, పాటిబండ్ల; "అబార్షన్ స్టేట్‌మెంట్" ఆంధ్రజ్యోతి (వార)
27. ప్రభాకర్, అలిసెట్టి; "ఎవ్వరమ్మా నువ్వు" సంక్షోభగీతం, హైదరాబాద్ స్వంతప్రచురణ 1990 పుట. 30.
28. శివారెడ్డి; "చర్య" శివారెడ్డి కవిత, హైదరాబాద్ : ఝరీ పోయిట్రీ సర్కిల్, 1992 పుట. 37.

# ఇటీవలి నవలలు – స్త్రీవాద ధోరణులు

—డా॥ కాత్యాయనీ విద్మహే

నవలా సాహిత్యంలో స్త్రీవాద ధోరణులు ఎలా ప్రతిఫలిస్తున్నాయో అర్థం చేసుకోవటానికి స్థూలంగానైనా స్త్రీవాదమంటే ఏమిటో తెలియాలి. 'ఫెమినిజమ్' అనే మాటకు తెలుగులో వ్యవహారనామం స్త్రీవాదం. స్త్రీవాదానికి 150 ఏళ్ళ చరిత్ర వుంది. పారిశ్రామిక విప్లవం వల్ల పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ రూపుదిద్దుకొంటూ అందుకు అనుగుణంగా ఉదార ప్రజాస్వామిక రాజకీయ భావాలు అభివృద్ధి చెందుతున్న చారిత్రక క్రమంలో అణచివేతకు గురవుతున్న వర్గంగా స్త్రీలను కూడా గుర్తించటం జరిగింది. మానవ సమాజంలో సగభాగంగా వున్న స్త్రీలు పురుషుల కంటే తక్కువ సాంఘిక స్థితిలో వుండటాన్ని ప్రశ్నిస్తూ వాళ్ళ అభ్యుదయాన్ని, విముక్తినీ వాంఛిస్తూ వచ్చిన స్త్రీవాద భావన పంధొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధానికి ఉద్యమరూపాన్ని తీసుకొని విస్తరించింది. బ్రిటిషు వలస పాలన కారణంగా స్త్రీవాదం భారతదేశంలోకి మధ్య తరగతివారి భావజాల వ్యవస్థను యథాశక్తిగా ప్రభావితం చేయటం ద్వారా ప్రవేశించింది. 1975 నుండి ప్రారంభమై కొనసాగిన అంతర్జాతీయ మహిళా దశాబ్దిలో స్త్రీవాదం ఒక బలమైన ధోరణిగా వేరూనుకొంది. తెలుగు సాహిత్య సాంస్కృతిక రంగాలను గొప్ప మార్పుకు లోనుచేసింది.

స్త్రీవాదంలో మూడు ప్రధాన ధోరణులున్నాయి. మొదటిది లిబరల్ ఫెమినిజమ్. పురుషులతో స్త్రీలకు సమాన హక్కులు అవకాశాలు కావాలని వ్యవస్థాపరిధిలో చేసే ప్రయత్నాలు ఈ ధోరణిలోకి వస్తాయి. విద్యా ఉద్యోగ రాజకీయ, ఆర్థిక వ్యవస్థలలో స్త్రీల భాగస్వామ్యాన్ని కోరుకోవటం, వాటిని పొందటం కోసం ఉద్యమాలు నిర్మించటం ఇందులో భాగం. భారతదేశంలోని సంస్కరణోద్యమంలో ఈ లిబరల్ ఫెమినిజమ్ ఛాయలే కన్పడతాయి. ఆ మేరకు స్త్రీ విద్యను గురించి, పురుషులతో సమానంగా ఉండాల్సిన సాంఘిక

సాంస్కృతిక స్థాయిని గురించి భావిస్తూ వీరేశలింగం గారు రచించిన 'సత్యవతీ చరిత్ర' ఆదమరయాళం నవలలు ఉదార స్త్రీవాద సాహిత్యానికి నాందీ రచనలు అనవచ్చును.

స్త్రీ వాదంలోని రెండవ ధోరణి రాడికల్ ఫెమినిజమ్ అంటారు. ఈ ధోరణిలో స్త్రీలను ప్రత్యేకమైన వర్గంగా భావించటం జరుగుతుంది. స్త్రీ పురుషుల మధ్య అసమానతను 'లైంగికత' (Gender) ప్రాతిపదికగా చర్చించటం ఈ ధోరణిలో ప్రత్యేకత. ఈ అసమ సామాజిక వ్యవస్థకు పితృస్వామ్యం మూలమని గుర్తించటంతో లిబరల్ ఫెమినిజమ్ కంటే రాడికల్ ఫెమినిజమ్ విప్లవాత్మకమైన ముందడుగు వేసింది. స్త్రీలకు తమ శరీరాల మీద, జీవితాల మీద అధికారం లేకుండా చేసి, ఆ అధికారాన్ని చలాయించే సంస్థలుగా కుటుంబాన్ని, మతాన్ని, రాజ్యాన్ని రూపొందించిన పితృస్వామిక సామాజిక వ్యవస్థను గురించిన విశ్లేషణకు సమాచార సామాగ్రిని అందించింది రాడికల్ ఫెమినిజమ్. "స్త్రీకి కూడా శరీరం ఉంది. దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకు మెదడు వుంది. దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకు హృదయం ఉంది. దానికి అనుభవం ఇవ్వాలి" అని 1925 లోనే చెప్పి 'స్త్రీ' అన్న రచన ద్వారా స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గురించి ఉద్వేగంలో వ్రాసిన చలం నవలలు రాడికల్ ఫెమినిస్టు ధోరణికి దగ్గరగా వుంటాయి. స్త్రీ శరీరం మీద, లైంగిక ఆకాంక్షల మీద సమాజం విధించిన కట్టడిని, సంస్కృతి నిర్మించిన నియమాలను ధిక్కరించి తమ జీవితాన్ని తమ ఆనందం కోసం, తమ ఇష్టం వచ్చిన పద్ధతులలో జీవించటానికి సిద్ధపడిన రాజేశ్వరి, శశిరేఖ, లాలస, అరుణ మొదలైన స్త్రీ పాత్రలను ప్రధానంగా చేసి చలం వ్రాసిన నవలలు ఇటీవలి స్త్రీవాద ధోరణి నవలలకు ఒరవడిని ఇచ్చాయి.

ఇక స్త్రీ వాదంలో మూడవది సోషలిస్టు ఫెమినిస్టు ధోరణి. లిబరల్ ఫెమినిజానికి సమాంతరంగా శ్రామికవర్గ ఉద్యమాలతోపాటు రూపుదిద్దుకొన్న సోషలిస్టు ఫెమినిజమ్ రాడికల్ ఫెమినిజం గుర్తించని ఆర్థిక అసమానతను స్త్రీ పురుషుల మధ్య అసమానతకు మూలకారణంగా గుర్తించింది. లైంగిక వివక్ష కారణంగా కుటుంబంలోను, సామాజిక ఉత్పత్తిరంగాలలోను అస్తిత్వంలోకి వచ్చిన శ్రమ విభజనను, ఆ శ్రమకు తగిన విలువలేకపోవటం అనే అంశాలను

ప్రముఖంగా చర్చకు పెట్టింది. స్త్రీని ఇంటి పనికి పరిమితం చేసి, దానిని అనుత్పాదక శ్రమగా మార్చిన అసమ ఆర్థిక వ్యవస్థను ప్రశ్నించటం, దాని మార్పుకై ఉద్యమాలు నిర్మించటం సోషలిస్టు ఫెమినిజమ్‌యొక్క లక్ష్యాలు. స్త్రీవాదం ఒక బలమైన వాదంగా ఆంధ్ర దేశంలోకి ప్రవేశించటం నూతన ప్రజాస్వామిక విప్లవాల నేపథ్యంలో జరిగింది. అందువల్లనే ఇటీవలి కాలపు నవలల్లో స్త్రీవాదపు ధోరణులు అటు పూర్తిగా రాడికల్ ఫెమినిస్టు ధోరణికి మాత్రమే చెందక సోషలిస్టు ఫెమినిజం లక్ష్యాలను కూడా కాలానుగుణంగా కలబోసుకున్నాయి. "జానకి విముక్తి" నవల దగ్గర ప్రారంభించి ఆంధ్ర ప్రభలో ఇప్పుడు సీరియల్‌గా వస్తున్న 'నాలుగ్గోడల బయట' నవలవరకు స్త్రీ వాద ధోరణులు తెలుగు నవలేతివృత్తాన్ని ప్రభావితం చేస్తున్నాయి.

స్త్రీవాద ధోరణిని ప్రతిఫలించటానికి 'జానకి విముక్తి' నవలే మొదటిదైనప్పటికీ ఆ నవల స్త్రీవాదంలోని అనేక ధోరణులను, కోణాలను ఇతివృత్తంలో భాగంగా సక్రమంగాను, సమగ్రంగాను ప్రతిఫలించ గలిగింది. పితృస్వామ్య సమాజం స్త్రీమీద అధికారం చలాయించే బలమైన శక్తిగా భర్తను ఎలా తయారు చేస్తుందో చూపిస్తుంది జానకి విముక్తి నవల. పితృస్వామ్య సామాజిక సంస్కృతి ఆడపిల్లగా పుట్టిన జానకిని పెరిగిన క్రమంలో ఒక స్త్రీగా తయారు చేసింది కనుకనే ఆమె భర్త తనమీద చలాయించే అధికార స్వభావాన్ని అసలు గుర్తించదు. ఏదో ఒక నెపంతో చీటికిమాటికీ భర్త తనను తిడుతున్నా కొడుతున్నా దానిని అతని హక్కుగా, తన కర్మగా భావించి అతనితో జీవిస్తుంది. చైతన్యవంతుడైన అన్నయ్య సత్యం సాహచర్య ప్రభావంవల్ల, తన సమస్యలను తాను మననం చేసుకొంటూ, విశ్లేషించి చూచుకొనే అంతర్ముఖ ఆలోచనా దృష్టిని పెంచుకొన్న జానకి, తనలాగే కుటుంబంలో భర్త అధికార దౌష్ట్యాలకు బలి అవుతున్న విశాలాక్షి జీవితాన్ని సన్నిహితంగా చూచి స్పందించే మానవీయ హృదయంతో క్రమంగా ఎదిగి భర్త అధికారాన్ని ప్రశ్నించే స్థితికి, దానినుండి విముక్తి చెందేందుకు ప్రయత్నించే దశకు ఎదుగుతుంది. జానకి విశాలాక్షుల స్నేహం, ఒకళ్ళగురించి ఒకళ్ళు తెలుసుకొంటూ, ఒకళ్ళకోసం ఒకళ్ళు ఆలోచిస్తూ తమతోటి జీవితాల గురించి మాట్లాడుకొంటూ తమ జీవితాలలోని అసంతృప్తిని బయటపెట్టుకున్న తీరు, సంసారం గుట్టు అన్న పాత సామెతను తిప్పికొట్టిన విధానం 'స్త్రీ జీవితంలో ఏదీ వ్యక్తిగతం కాదు. వ్యక్తిగతమంతా రాజకీయమే' అన్న స్త్రీ వాద భావనను ప్రతిఫలిస్తుంది.

అనుత్పాదకమైన విసుగు కలిగించే ఇంటి చాకిరీలో స్త్రీల జీవితం మగ్గిపోవటాన్ని స్త్రీవాదం వ్యతిరేకిస్తుంది. భర్త దగ్గర జానకి జీవితం అటువంటి ఇంటిపనిలో నలిగిపోయినదే. భర్తను వదిలి, అన్నగారైన 'సత్యం' దగ్గరకు వెళ్ళాక అమెకు ఇంటి చాకిరి ఆడవాళ్ళది మాత్రమే కాదన్న అభిప్రాయాన్ని అతని ఆచరణ కలిగిస్తుంది. సత్యం, అతని భార్య శాంత, జానకి అందరూ ఒక ఇంట్లో ఉంటూనే ఇంటి పనులను అందరూ కలిసి చేసుకొనే క్రొత్త సమాజపు వాతావరణాన్ని కల్పించుకొన్నట్లు సవలేతివృత్తాన్ని తీర్చటం ద్వారా రంగనాయకమ్మ లైంగిక వివక్ష కారణంగా పని విభజన వుండే పితృస్వామిక సామాజిక సంస్కృతిలో సమూలమైన మార్పును ఆశించారు. అలాగే తన పుస్తకాలు చదివే అలవాటును, తన వైజ్ఞానిక తృష్ణను, తన సామాజిక జీవితాన్ని అదుపు చేస్తూ తనమీద అధికారం చలాయించబోయిన నిశ్చితార్థపు వరుడు కిశోర్‌ను పెళ్ళి చేసుకోవటానికి నిరాకరించిన శారద పాత్రను సృష్టించటంలో రంగనాయకమ్మ స్త్రీవాద దృక్పథం కనబడుతుంది. స్త్రీ శరీరం మీద స్త్రీకి హక్కు వుండాలని బలంగా చెప్పే స్త్రీవాదం పిల్లల్ని నవమాసాలు మోసి కనటం, ప్రసవించటం స్త్రీ శరీరానికి సంబంధించిన అంశం కనుక దానివలన కలిగే బాధ బరువు అన్నీ భరించాల్సింది స్త్రీయే కనుక పిల్లల్ని కనటం, కనక పోవటం అనేది స్త్రీ ఇష్టానుసారం జరగాలని స్త్రీవాదం చెబుతుంది. సత్యం శాంతల దాంపత్యంలో పిల్లల్ని కనను అనటం మాత్రం స్త్రీ ఇష్టమే, ఆ విషయంలో మాత్రమే ఎవరి ఒత్తిడులూ బలవంతాలు ఉండటానికి వీల్లేదు అని శాంత చేత చెప్పించి రంగకమ్మ స్త్రీవాద ధోరణిలోని ఆ ప్రత్యేకాంశానికి 'జానకి విముక్తి' నవలలో ప్రాతినిధ్యం కల్పించారు.

జానకి విముక్తి నవల వచ్చిన ఐదేళ్ళకు అంటే 1987 లో వచ్చిన ఓల్గా నవల 'స్వేచ్ఛ' స్త్రీవాద ధోరణులను బలంగా ప్రతిధ్వనించింది. సాంప్రదాయిక కుటుంబ వ్యవస్థా చట్రంలో తల్లిదండ్రుల అదుపులో అన్నదమ్ముల నిఘాలో ఊపిరాడకుండా పెరిగిన అరుణ స్వేచ్ఛను తన జీవితాదర్శంగా చేసుకొంటుంది. లెక్చరరుగా పనిచేస్తూ తనదైన సామాజిక జీవితాన్ని నిర్మించుకోవాలనుకున్న అరుణ ఆ క్రమంలో భర్త అధికారాన్ని ఎదుర్కోవలసి రావటం ఆమె జీవితంలో సంఘర్షణకు కారణమవుతుంది. ఉద్యోగిగా తోటివాళ్ళతో కలిసి తాను చేసే పనులన్నింటికీ, తీసుకొనే నిర్ణయాలన్నింటికి భర్తకు సంజాయిషీ ఇవ్వాల్సి రావటం

ఆమె భావ ప్రపంచాన్ని, భౌతిక జీవితాన్ని అల్లకల్లోలం చేశాయి. తనకంటూ సామాజిక జీవితం ఏమీ లేకుండా ఆర్థిక ప్రయోజనాలను ఈడేర్చగల ఉద్యోగం చేయటానికి మాత్రమే అనుమతిస్తూ ఇంటిపనులలో, పిల్లల పోషణలో అచ్చమైన గృహిణిగా తాను కాలం గడపటం ప్రకాశానికి ఎంతఇష్టమో, అరుణకది అంతగా ఆత్మవేదనా కారణం అవుతుంది. తనలో తాను సంఘర్షిస్తూ ప్రకాశంతో ఘర్షణ పడుతూ ఎప్పటికప్పుడు రాజీపడుతూ తనను, తన భావాలను, తన ఆచరణను ఏమాత్రం గౌరవించలేని భర్తతో ఏమీ జరగనట్లుగా మామూలుగా జీవించటం నానాటికీ దుర్భరమవుతున్న పరిస్థితులలో అరుణ తన ఆదర్శాలను ఒదులుకొని భర్తతో కలిసి జీవించటమా, తన ఆదర్శాలకోసం భర్తను వదిలివేయటమా అన్న సంఘర్షణకు లోనై, చివరకు భర్తను ఒదిలేసి వెళ్ళటంతో ఈ నవల ముగుస్తుంది.

అరుణతోపాటు ఆమె స్నేహితురాలు ఉమ 'కుటుంబం' అనే వ్యవస్థతో పని లేకుండా ఒక పురుషున్ని తన జీవిత భాగస్వామిగా ఎన్నుకోవటం కూడా ఈ నవలేతివృత్తంలో భాగంగా వుంది. ఉమ ఆరునెలలుగా సుధీర్‌తో సంబంధాలలో వున్నా పనిగట్టుకొని ఆ విషయాన్ని ఎవరికైనా చెప్పాలని గానీ, తమ సంబంధాన్ని పెళ్ళిగా ప్రకటించుకొని అందరి ఆమోదం పొందాలని గానీ అనుకోలేదు. వేరువేరుగా ఎవరి ఇళ్ళల్లో వాళ్ళుంటూ ఒకరి స్నేహం, ప్రేమ ఇంకొకరికి కావాలనిపించినప్పుడు కలిసి ఒక ఇంట్లో వుండటానికి వాళ్ళు చేసుకొన్న ఏర్పాటు ఉమకు చాల సహజమైందిగా సంతృప్తికరంగా అనిపిస్తుంది. కుటుంబ వ్యవస్థలో స్త్రీ పురుషులు కలిసి వుంటే అది పురుషుడ్ని అధికార స్థానంలో నిలిపివుంచే పితృస్వామిక వ్యవస్థ కనుక స్త్రీని అదుపుచేసే సాధనమవుతుందన్న ఆందోళన నుండి ఓల్గా ఈ రకమైన స్త్రీ పురుషుల సంబంధాన్ని ఒక ప్రయోగంగా చూపించారు. వాస్తవ సామాజిక జీవితంలో ఈ ప్రయోగం యొక్క పరిణామాలు ఎలా వుంటాయో ఓల్గా ఊహకు పూర్తిగా అందలేదు కనుకనే అరుణచేత ఈ ప్రయోగాన్నిగురించిన సందేహాలను వ్యక్తంచేయించారు.

స్వేచ్ఛ నవల వ్రాసిన తరువాత ఓల్గా వ్రాసిన మరొక నవల 'కన్నీటి కెరటాల వెన్నెల.' భర్త చనిపోయి దుఃఖంలో వున్న రేణు ఆ దుఃఖం నుంచి బయటపడటంకోసం పూనాలోని ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో ఒక కోర్సుకు హాజరు

కావాలని వెళ్ళటంతో ప్రారంభమయ్యే ఈ నవల ఆమె అక్కడ తనకు పరిచయమైన వ్యక్తుల జీవితాలనుండి స్త్రీ పురుష సంబంధాలను గురించిన కొత్త విషయాలను అర్థం చేసుకొనే ప్రయత్నంగా కొనసాగుతుంది. గమన అనే అమ్మాయి బీరు పార్టీకి హాజరు కావటం ఇందులో ఒక సన్నివేశం. ఆ సందర్భంలో గమన తాగుతుందా అని రేణు నివ్వెరపోతుంది ఆందోళనకు లోనవుతుంది. మగవాళ్ళ త్రాగుడు గురించి పట్టించుకోని తాను ఆడవాళ్ళ త్రాగుడు గురించి ఎందుకు ఆలోచిస్తున్నానా అని వితర్కించుకొంటుంది. ఆడవాళ్ళు, మగవాళ్ళు ఇద్దరూ మనుషులే కనుక సిగరెట్టు తాగినా బీరు బ్రాందీలు త్రాగినా ఆడవాళ్ళను మాత్రమే తప్పు పట్టాల్సిన అవసరమేమిటనీ, తప్పయితే ఎవరిదైనా తప్పేననీ, తప్పు కాకపోతే ఎవరిదీ తప్పుకాదనీ తీర్మానించుకొంటుంది రేణు. అలాగే ఈ సమాజంలో పురుషులకు దాంపత్యేతర సంబంధాలుంటున్నాయి కనుక, స్త్రీలకుంటే మాత్రం తప్పేమిటన్న ప్రశ్నను మాధవి పాత్ర ద్వారా వేయించారు ఓల్గా. ప్రశ్నించటమే కాక ఇంతకాలం నుండి ఈ సమాజం, ఈ సంసారం, ఈ భర్త అందరూ తనకు ద్రోహమే చేశారని, ఆ ద్రోహానికి తగిన ప్రతీకారం చేయాలని కోరికతో జ్వలించి పోతున్నానని అంటూ మాధవి-వ్యాపారాల్లో మునిగితేలుతూ తన కిష్టమైన స్త్రీలతో సంబంధాలు పెట్టుకొంటూ జీవించే భర్తమీద పంతంతో అతనికిలేని నిషేధం తనకెందుకంటూ వేరొకవ్యక్తితో లైంగిక సంబంధాలు ఏర్పరచుకోవాలనుకొంటుంది. భార్యాపిల్లలు వున్న సంజయ్‌తో నాలుగురోజుల ఆనందం కోసం 'తమాషాగా' కలిసి వుండాలనుకొన్న రజని ప్రవర్తనను ఎవరికీ నష్టంలేని వ్యవహారంగా సూర్యంచేత చెప్పించి అనుకూల దృక్పథం నుండి చూపించిందీ నవల. పితృస్వామ్య సమాజంలో పురుషుడికి అందివచ్చిన భోగలాలస జీవిత స్వభావాన్నిగానీ, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో లభించిన విశృంఖల స్వేచ్ఛాస్వభావాన్నిగానీ ప్రశ్నించకుండా, విమర్శించకుండా, అవి స్త్రీకి వుంటే తప్పేమిటన్న ధోరణిలో ఇతివృత్తాన్ని నడిపించి, ఈ వ్యవస్థలో స్త్రీలు తరతరాలుగా పడుతున్న వేదనకు ప్రతీకార చర్యలుగా వాటిని భావించమని, అలా భావించటం సరి అయిన విధానమన్నట్లుగా వ్రాయటం రాడికల్ ఫెమినిజంలోని అతివాద ధోరణి.

1989 లో ఓల్గా వ్రాసిన మరొక నవల మానవి. పితృస్వామ్య సామాజిక వ్యవస్థకు ప్రధానాంగమైన కుటుంబాన్ని విమర్శకు పెట్టింది స్త్రీవాదం. కనుకనే ఆ కుటుంబ చక్రం యొక్క బోలుతనాన్ని, అనావశ్యకతను చూపించటంగా

మానవి నవల వ్రాశారు ఓల్గా. సురేష్‌ను పెళ్ళాడి అతనితోటి సంసారమే తన బ్రతుకు అనుకొని ఇంటిని చక్కదిద్దుకొంటూ, పిల్లల్ని పెంచుకొంటూ కుటుం బానికి తన జీవితాన్నంతా వెచ్చించిన వసంత తన భర్త మరొక స్త్రీతో సంబం ధాలు ఏర్పరచుకొన్నాడని తెలిసినప్పుడు గొప్ప అందోళనకు లోనవుతుంది. క్రమంగా 'కుటుంబం' మీద విరక్తిని పెంచుకొంటుంది. సురేశ్ భార్యగా అతని పిల్లలకు తల్లిగా తన ఉనికి గురించి ఇన్నాళ్ళు గర్వపడుతున్న వసంత భర్త తన వాడు కాకపోయేసరికి, పిల్లలు తన గురించి పట్టించుకోకపోయేసరికి మనిషిగా తనను నిరూపించుకోవటానికి కుటుంబం బయట కొత్త ప్రయత్నాలు చేయాల్సి వచ్చింది. ఆ క్రమంలో ఆదర్శ భార్యగా జీవించాలని పెట్టుకొన్న తన గమ్యమే 'తప్పు' అని తెలియటం తను జీవశక్తిగల స్వతంత్ర వ్యక్తిగా మారటానికి ఉపకరించిందని వసంత తెలుసుకొంటుంది కూడా.

స్త్రీకి కుటుంబమే సర్వస్వం అయిన స్థితినుండి స్త్రీకి సామాజిక జీవితం ఉండాలన్న ఆలోచనకు స్త్రీ చైతన్యం పరిణమించేందుకు ప్రేరణను ఇయ్యటం వరకు మానవి నవల సరిగానే పనిచేసింది. అయితే ఇందులో స్త్రీ పురుష సంబం ధాల విషయంలో వివాదాస్పదమైన విషయాలు చోటు చేసుకొన్నాయి. వసంత స్నేహితురాలు శాంత పెళ్ళయి పిల్లలున్న రాధాకృష్ణతో లైంగిక సంబంధాలు ఏర్పరచుకోవటం గానీ వసంత భర్త సురేష్ తోడిడాక్టరు నీలిమను సహచరిగా స్వీకరించటం గానీ చాలా సాధారణాంశాలుగా స్వీకరించదగిన వన్నట్లుగా నవ లేతివృత్తం ప్రవర్తిస్తుంది. ఒక ఇద్దరు వ్యక్తులు తమ ప్రేమకోసం తమ ఆనందం కోసం ఆ రకమైన సంబంధా లేర్పరచుకొంటే ప్రపంచమేమైనా తలకిందులవు తుందా అని ప్రశ్నవేసి, కాదు కనుక అవి ఎవరూ ప్రశ్నించటానికి వీలులేని ఉన్నతమైన ఉత్తమమైన స్త్రీ పురుష సంబంధాలుగా విశ్వసించమని ఈ నవల అంటుంది.

పురుషుడు మరొక స్త్రీతో ప్రేమ సంబంధాన్ని ఏర్పరచుకోవటాన్ని భార్యల వైపు నుండి చూడటం కాక ఆ మరొక స్త్రీ వైపు నుండి చూడమని సూచించటం ద్వారా ఈ నవల అసలే కుటుంబ వ్యవస్థా పరిధిలో భర్తల అధికార దౌష్ట్యాలకు గురవుతూ బ్రతుకుతున్న భార్యలకు అదనంగా మరొక సమస్యను సృష్టించినట్లే అయింది. తన శరీరం మీద తనకు హక్కు, కుటుంబ వ్యవస్థతో

నిమిత్తం లేని స్త్రీ పురుష సంబంధాలు అనే భావనలు ఆధునిక మహిళను ప్రభావితం చేస్తూ ఆచరణ ప్రయోగాలకు పురికొల్పుతుంటే అది మరొక వైపునుండి అశేష కుటుంబ స్త్రీల జీవితాల మీద వ్యతిరేక ఫలితాలనిచ్చే అవకాశం ఏర్పడుతుంది. పితృస్వామిక సామాజిక వ్యవస్థా చట్రంలో దాంపత్యేతర లైంగిక సంబంధాలు ఏర్పరచుకోవటానికి అన్ని అవకాశాలను కల్పించగలగటం ఈ ధోరణిలోని వ్యతిరేక ముఖం. తత్ఫలితంగా జీవితంలో ఏర్పడే వైరుధ్యాలను చర్చలోకి తీసుకురాకపోవటం ఒక లోపం. 1987 లో స్త్రీల జీవిత రంగాలలోని అన్ని అంశాలను గురించి ఆలోచిస్తూ సమగ్ర దృక్పథంతో స్త్రీవాద ధోరణులను ఇతివృత్తంలో భాగం చేస్తూ 'స్వేచ్ఛ' నవల వ్రాసిన ఓల్గా ఆ తరువాత 'స్త్రీల శరీరం మీద లైంగికతమీద స్త్రీలకు హక్కు', 'కుటుంబంతో నిమిత్తంలేకుండా స్వేచ్ఛాయుత స్త్రీ పురుష సంబంధాలు' అన్న ఒకటి రెండు అంశాలనే ప్రధానం చేసి వేరువేరు కోణాలనుండి నవలలు వ్రాయటం ద్వారా తెలుగు నవలలో స్త్రీవాద దృక్పథ ప్రతిఫలన పరిధిని సంకుచితం చేశారు.

ఓల్గా ఒరవడిలో 'వంశాకురం' (1988) నవల వ్రాసిన మల్లాది సుబ్బమ్మ పెళ్ళి, సంతానం అనేవి స్త్రీల వ్యక్తిత్వ వికాసానికి అభివృద్ధికి అటంకం కారాదన్న దృక్పథంతో నవలేతి వృత్తాన్ని నిర్మించారు. పెద్ద సైంటిస్టు కావాలన్న తపనతో చదువు ప్రారంభించి, ఒకరి తరువాత ఒకరిగా వరుసగా ముగ్గురిని ప్రేమించి తన ఆదర్శాలకు, ఆకాంక్షలకు వాళ్ళు తగినవాళ్ళు కాదని వదిలేస్తూ చివరికి చంద్రం అనే వ్యక్తిని పెళ్ళాడి, తన పరిశోధనకు అవరోధమవుతుంది కనుక గృహిణీత్వ బాధ్యతలకు దూరంగా అతని నుండి వేరుగా క్వార్టర్‌లో వుండే నళిని శాస్త్రజ్ఞురాలిగా తన ఎదుగుదలకు పిల్లలు అడ్డు అవుతారని గర్భస్రావం చేయించుకొంటుంది. తన అనుమతి లేనిదే తన గర్భంలో ఎదగటానికే వీలు లేదన్న ఆలోచన ఒక సహజాంశంగా ఆమె ప్రవృత్తిలో వుంది. కనుకనే ఆ విషయమై చంద్రంతో సంప్రదించాలని కూడా ఆమె అనుకోదు. ఆ విషయమై భర్త అభ్యంతర పెడితే అతనినుండి శాశ్వతంగా విడిపోవటానికి సిద్ధమవుతుందామె.

తమ ఆదర్శాలకు, లక్ష్యాలకు అనుగుణమైన పురుషులు దొరికే వరకు స్త్రీలు వైవాహిక సంబంధాలలో చిక్కుకోరాదని, ఒకసారి వైవాహిక బంధాల

లోకి వచ్చిన తరువాత కూడా అవి ఏమాత్రం తమ వ్యక్తిత్వ వికాసాలకు అవరోధమైనా వాటినుండి బయటపడాలని ఈ నవల చెబుతుంది. స్వేచ్ఛ నవలలో ఉమ సుధీర్‌ల లాగా లైంగిక సంబంధాలలో వుంటూనే వేరు వేరుగా జీవించే పద్ధతిని నళిని జీవితాదర్శంగా నిరూపించిన ఈ నవల జానకి విముక్తి నవలలో పిల్లల్ని కనటం స్త్రీ ఇష్టానుసారంగా జరగాలన్న శాంత అభిప్రాయాన్ని నళిని జీవితాచరణలో భాగం చేసింది. జీవశాస్త్ర పరిశోధకురాలిగా అత్యున్నత స్థానానికి చేరుకోవటం గమ్యంగా జీవించిన నళిని తనను తాను అసాధారణ స్త్రీని అనుకొంటుంది. ఈ నవలకు 'మాతృత్వవాంఛలేమి నేరమా' అన్న శీర్షికతో వెనుకమాట వ్రాసిన ఎమ్. వి. రామ్మూర్తిగారు సాధారణ వ్యక్తులకు జీవితాలకు వర్తించే సాధారణ నియమాలు అసాధారణ వ్యక్తులకు వర్తించవని చెప్పి నళిని ఎన్నుకొన్న జీవిత విధానాలను సమర్థించారు.

అయితే స్త్రీలను సాధారణ సామాజిక నియమాల ప్రకారం జీవిస్తూ పిల్లల్ని కంటూ పెంచుతూ ఉండే ఒక వర్గంగానూ, అసాధారణ జీవిత సూత్రాలను ఏర్పరచుకొని వ్యక్తిగత అభివృద్ధికోసం, సామాజిక కార్యకలాపాల కోసం ప్రత్యేక జీవిత విధానాన్ని ఏర్పరచుకొనే అసాధారణ స్త్రీలు అనే మరొక వర్గంగానూ విడదీయటం అంత సరియైన పద్ధతి కాదు. స్త్రీవాదమే మానవ సమాజాన్ని స్త్రీపురుష జాతిభేదం ప్రాతిపదికగా రెండు వర్గాలుగా విభజిస్తే దానికితోడు స్త్రీవాద చైతన్యం అలవరచుకొన్న స్త్రీలు మొత్తం స్త్రీజాతి నుండి తమను భిన్నమైన అసాధారణ స్త్రీలుగా ప్రత్యేకవర్గంగా భావించుకోవటం వాస్తవ సామాజిక జీవితంలో అనేక వైరుధ్యాలకు, గందరగోళాలకు దారితీస్తుంది. ఇది స్త్రీలలోనే రెండు వర్గాలను సృష్టిస్తుంది. కనుక పీడిత మహిళా విముక్తికి కావల్సిన ఏకతను సాధించలేకపోతుంది. ఫలితంగా స్త్రీవాదం వ్యక్తివాదంగా మిగిలిపోయే ప్రమాదం వుంది. అందుకని నవలా రచయితలు స్త్రీవాద ధోరణులను ఇతివృత్తంలో భాగంగా చేసి వ్రాసేటప్పుడు అంతిమంగా తామాశించే స్త్రీవిముక్తి అన్న అంశానికి తమ సాహిత్య సామాజిక నిబద్ధతకు మధ్య వైరుధ్యం రాకుండా చూచుకోవాలి.

స్త్రీవాద ఆలోచనా విధానం లింగవివక్షను, అందుకు మూలమైన పితృస్వామ్య వ్యవస్థను గురించిన మౌలికమైన చర్చ ప్రారంభించి పుట్టుక నుండి

మొదలుపెడితే అన్ని సామాజిక రంగాలలోను శ్రమ విభజనలోను విలువ నిర్ణయంలోను స్త్రీపురుష అసమానతలు ప్రాతిపదికాంశాలుగా పనిచేయటం ఎంత తీవ్రస్థాయికి చేరుకొన్నదో అర్థమయేందుకు కావలసిన చైతన్యాన్నిచ్చింది. ఈ అసమానతల నుండి విముక్తికై స్త్రీపురుషులను ప్రేరేపించి మహిళా ఉద్యమ నిర్మాణానికి దారులు తీయగలిగిన జీవశక్తి, సత్తా దానికి ఉన్నాయి. దానిలో భాగంగానే అంతకు ముందున్న వివిధ రాజకీయ సాంఘిక సంస్థలలో స్త్రీల సమస్యలకు సరిఅయిన ప్రాధాన్యతనిచ్చి చర్చించకపోవటం వలన కలిగిన అసంతృప్తి నుండి స్వతంత్ర ప్రతిపత్తిగల మహిళా సంస్థలు ఏర్పడ్డాయి. స్వేచ్ఛ నవల ఈ విధమైన మహిళా సంస్థల ఆవిర్భావావసరాన్ని సూచించింది.

కాలేజీ విషయాలలోను, సామాజికాంశాలలోను నలుగురితో కలిసి అందరికీ పనికొచ్చే పనులు చేయాలని అందుకు సిద్ధపడిన అరుణ, అందుకు భర్త వ్యతిరేకతను ఎదుర్కోవలసిన పరిస్థితులలో వుండి తన సమస్యను తనతోపాటు పనిచేసే వాళ్ళతో కలిసి చర్చించాలనుకొంటుంది. వాళ్ళందరూ ఆమెకు సామాజిక కార్యకలాపాలు మానేసి స్వంత సమస్యను పరిష్కరించుకోమని సలహా ఇస్తారు తప్ప, ఆమె సమస్య పట్ల సహానుభూతిని ప్రదర్శించలేకపోతారు. దానితో ఆమెకు అలాంటి సంస్థలతో కలిసి పనిచేయటం అసహ్యమనిపిస్తుంది. తాను స్త్రీ అని అనుక్షణం గుర్తు చేస్తూ తనను అదుపులో ఉంచేందుకు పనిచేసిన అన్ని సంబంధాలను, వ్యవస్థలను త్రోసిరాజని, తనలాంటి స్త్రీల స్వేచ్ఛకోసం తనలాంటి స్త్రీలను కలుపుకొని ఉద్యమ స్థాయిలో పని చేయాలనుకొంటుంది. స్వయం ప్రతిపత్తి మహిళా సంఘాలు అనేకం ఏర్పడి పనిచేస్తున్న సమకాలీన ఉద్యమ చైతన్యంనుండి ఓల్గా స్వేచ్ఛ నవలేతివృత్తానికి దానినే గమ్యంగా చూపించారు.

అయితే ఏ సాంప్రదాయిక సామాజికార్థిక రాజకీయ వ్యవస్థలతోనూ నిమిత్తం లేని స్వతంత్ర ప్రతిపత్తి అస్తితాభావన స్త్రీవాద దృక్పథంలోని సమస్తమూ కాదు. ముఖ్యంగా భారతదేశంలో స్త్రీవాదం ఎక్కువగా మహిళా విముక్తి ఉద్యమాలు అన్ని సామాజికార్థిక అసమానతలకు వ్యతిరేకంగా సాగే విశాల ఉద్యమాలకు అ దృక్పథ చైతన్యమే జానకి విముక్తి నవలలో కనబడుతుంది. స్త్రీల జీవితంలోని వేదనను, బానిసత్వాన్ని విశ్లేషణాత్మకంగా నిరూపించి నవల వ్రాసిన రంగనాయకమ్మ స్త్రీల విముక్తిని రెండు స్థాయిలలో చూపించారు.

మొదటిది సరియైన చైతన్యాన్ని అలవరచుకోవటం ద్వారా స్త్రీలు తామున్న దుర్భర దౌర్జన్యపూరిత కుటుంబ వ్యవస్థనుండి వ్యక్తిగత స్థాయి విముక్తిని సాధించటం. తనతో తాను, తనచుట్టూ వున్న పరిస్థితులతో తాను సంఘర్షించి విజయం సాధించిన జానకి ఆ రకమైన విముక్తిని పొందింది

కాగా రెండవ స్థాయిలో శ్రామిక మహిళల విముక్తి పోరాటాలతో ఈ విజయాలను కలిపి పితృస్వామ్య సామాజిక వ్యవస్థను అస్తిత్వంలోకి తెచ్చిన అసమ ఆర్థిక వ్యవస్థను మార్చుకోవటం వైపు దృష్టి మళ్ళించటం ఈ నవలేతివృత్తానికి లక్ష్యం. అందువల్లనే సోషలిస్టు ఫెమినిస్టు ధోరణి ఈ నవలలో బలీయంగా కనబడుతుంది. 'కమ్యూనిస్టు సమాజంలో అయితే ఆడవాళ్ళ మీద ఇలాంటి పెత్తనాలు నడుస్తాయా' అన్న జానకి ప్రశ్నలో నడవవు అన్న దృఢమైన విశ్వాసంతో కూడిన సమాధానం ఇమిడే వుంది. 'బూర్జువా కుటుంబాల ఆడవాళ్ళు కొందరు తప్ప మిగతా ఆడవాళ్ళంతా కమ్యూనిజాన్ని సమర్థిస్తారు. దాని గురించి సరిగా తెలిస్తే' అని భావించే జానకి కార్మికోద్యమంలో భాగం పంచుకోవటం సహజంగా జరిగింది. అల్లం రాజయ్య అగ్నికణం నవల కూడా స్త్రీల మీద జరిగే పీడననుండి విముక్తికి విప్లవోద్యమాలలో స్త్రీల భాగస్వామ్యమే సరియైన విధానమని సూచిస్తుంది. ఈ దృక్పథాన్ని జీవిత విధానంగా చేసి బలంగా నిరూపించగల ఇతివృత్తాలతో నవలలు ఇంకా రావలిసే వున్నాయి.

అయినప్పటికీ స్త్రీవాద దృక్పథం వల్ల 1980 దశకంలో నవలేతివృత్తాలలో వచ్చిన పరిణామం మాత్రం గణనీయమైంది. స్త్రీల సమస్యలను, ముఖ్యంగా స్త్రీల మీద అమలయ్యే కుటుంబ హింసను వివిధ కోణాల నుండి చర్చకు పెట్టటానికి నవలా రచయితలకు తక్షణ ప్రేరక శక్తి స్త్రీవాదమే అయింది. 'రక్తం కార్చిన కాటుక కళ్ళు' వంటి నవలలు కుటుంబ హింసను మాత్రమే చిత్రించి వూరుకొంటే, 'వేగుచుక్క' లాంటి నవలలు స్త్రీలు దానిని వ్యతిరేకించే చైతన్యాన్ని స్వీయ జీవితానుభవం నుండి పొందటాన్ని నిరూపించాయి. ఆ క్రమంలోనే సీత భర్తను వదిలేసి తనదైన బ్రతుకును తాను నిర్మించుకోవటానికి ప్రయత్నించటాన్ని చిత్రించింది వేగుచుక్క నవల. (ఆగస్టు 1988 చతుర.) తాను ప్రేమించి అభిమానించే భర్త తనను అనుక్షణం అనుమానిస్తున్నాడని, డాక్టరుగా వృత్తిలో తన అభివృద్ధికి, తోడి మగడాక్టరుతో తన వృత్తి సాన్నిహిత్యానికి అసూయపడి

తనను వంచించటానికి సిద్ధపడ్డాడని తెలిసినప్పుడు డా. శైలజ చాలా గంభీరంగా అతనితో తన సంబంధాన్ని తెగతెంపులు చేసుకొని, డాక్టరుగా తన వృత్తిపై దృష్టి కేంద్రీకరించటం ఇతివృత్తంగా వచ్చిన నవల 'జీవిత గమ్యం' (వనితా జ్యోతి, 1988 ఆగస్టు).

స్త్రీకి పెళ్ళి, సంసారం కంటే సామాజిక జీవితం గొప్ప ధైర్యాన్నిచ్చే అంశంగా ప్రతిపాదించటానికి జరిగిన మంచి ప్రయత్నంగా ఈ నవలను చెప్పుకో వచ్చు. కుటుంబ హింసకు పరాకాష్ఠ రూపమైన 'సతీసహగమన' దుర్ఘటనను కేంద్రంగా చేసుకొని పుట్టినప్పటినుండి, ఇంకా మాట్లాడితే లింగ నిర్ధారణ పరీక్ష ద్వారా పుట్టబోయే శిశువు ఆడదేనని తెలిసినప్పటి నుండి స్త్రీ మీద మొదలయ్యే వేధింపుల గురించి, వధూ దహనాల గురించి, వరకట్నపు హత్యల గురించి, అందుకు మూలమైన పితృ స్వామిక అసమ ఆర్థిక వ్యవస్థ గురించి ఆలోచనలను నవలా రూపంలోకి తీసుకువచ్చి, పురుషుడితో సమాన ప్రతిపత్తి కోసం మహిళ లంతా సంఘటితం కావాలని చెప్పే సతి మంటలు నవల (నవంబరు 1991, చతుర) ఇతివృత్తానికి పరిమిత పరిధిలోనైనా స్త్రీవాద దృక్పథమే తాత్త్విక భూమిక అయింది.

అయితే స్త్రీ వాదంలోని 'పురుష పీడనపట్ల వ్యతిరేకత' అన్న అంశాన్ని తరచుగా పురుష వ్యతిరేకతగా అర్థం చేసుకోటం జరుగుతుంది. ఇందుకు బాధ్యత కొంతవరకు స్త్రీవాద దృక్పథ వాఖ్యానంలో వుంది. స్త్రీ వాద దృక్పథం కోరే లైంగిక వివక్షలేని సామాజిక నిర్మాణం వల్ల సాంస్కృతిక ఆధిక్యతా ఆధిపత్యాలను, అధికార హోదాలను కోల్పోయే వర్గాలు సృష్టించే భ్రాంతి కల్పనలో వుంది. తత్ఫలితంగానే స్త్రీవాద ఆలోచనా విధానాన్ని అరకొరగా అర్థం చేసుకొంటూ - అవహేళన చేయటం అసంబద్ధమైనదని నిరూపించటం ధ్యేయంగా - సాహిత్య వస్తువును చేయటం జరుగుచున్నది. ఆ మధ్య ఆంధ్ర ప్రభలో సీరియల్‌గా వచ్చిన 'వరుడు కావాలి' నవల ఆ రకంగా వ్రాయబడినదే. చదువుకొని ఉద్యోగం సంపాదించుకొన్న ఒక స్త్రీ తాను పురుషుడి కంటే ఎందు లోను తక్కువ కాదన్న ఆత్మవిశ్వాసాన్ని అలవరచుకోవటంతో ఆగక, తాను ప్రస్తుత వ్యవస్థలో పురుషుడనుభవిస్తున్న అధికార హోదాలను, సౌకర్యాలను అనుభవించాలనుకొని 'స్త్రీ'లా ఇంట్లోవుండి వంటచేసి పెట్టి ఇల్లు చక్కదిద్దుకొనే

భర్త కావాలనుకొని ఆ మేరకు పత్రికా ప్రకటన ఇచ్చి, ఇంటర్వ్యూకు హాజరైన వ్యక్తుల నుండి ఒకనిని ఎన్నుకొని పెళ్ళాడుతుంది. ఇటువంటి సంబంధాలలో తాను స్త్రీగా ఎంత కోల్పోయిందో ఆమెకు క్రమంగా అర్థమవుతుంది.

ఆమె ఎప్పటికయినా తన పొరపాటును గ్రహించే అవకాశముందని తెలిసినవాడు కనుక తండ్రి తనకు మేనల్లుడి వరుస బంధువైన యువకుడ్నే ఆమె కావాలనుకొన్న వరుడి అర్హతలతో ప్రవేశపెట్టాడు. అటు తండ్రి, ఇటు భర్త కలిసి కుటుంబంలో ఇప్పుడు స్త్రీ పురుషులకు వున్న స్థానం, నిర్వహిస్తున్న బాధ్యతలే సరియైనవన్న గుణపాఠం ఆమెకు నేర్పటంతో నవల ముగుస్తుంది. స్త్రీవాద దృక్పథంలోని 'స్వతంత్ర ప్రతిపత్తి' అన్న అంశాన్ని అనుకూల దృక్పథం నుండికాక వ్యతిరేక ముఖంనుండి అర్థం చేసుకొని దానిని త్రిప్పి కొట్టటానికన్నట్లుగా ఈ నవలను వ్రాశాడు శైలకుమార్.

అంతేకాదు, స్త్రీవాద దృక్పథ చైతన్యం పెరుగుతున్న కొద్దీ దానిని సమర్థిస్తున్నట్లుగానే ప్రారంభించి, అంతిమంగా అందుకు వ్యతిరేకమైన అవగాహనను కలిగించే విధంగా వచ్చే నవలలు కూడా వున్నాయి. యద్దనపూడి సులోచనారాణి వ్రాసిన సౌగంధి నవల అటువంటిదే. యద్దనపూడి సులోచనారాణి నవలలో కథకు ఎప్పుడూ ఒక మూస నమూనా వుంటుంది. నాయికానాయకులు, వాళ్ళ మధ్య ప్రేమ. అదే సమయంలో ఎవరి వ్యక్తిత్వాలు(?) వాళ్ళు నిలుపుకోవాలనే తపనతో వాళ్ళ మధ్య సంఘర్షణ. ప్రేమ, ద్వేషం అనే పరస్పర విరుద్ధాంశాలు సంఘర్షించి, సంఘర్షించి చివరకు ప్రేమ గెలుస్తుంది. సౌగంధి నవల కూడా ఈ మూసలోదే. వత్సల్, సౌగంధి చిన్నప్పటి నుండి కలిసి పెరిగినవాళ్ళు. ఇష్టపడి పెళ్ళి చేసుకొందామనుకొన్నవాళ్ళు. కానీ హైదరాబాదులో చదువు కొంటున్న సౌగంధి పెళ్ళికి తాత్సారం చేస్తుంటుంది. పెళ్ళివల్ల తన వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం నశిస్తాయేమోనన్న అనుమానం వుంది. సౌగంధిలో యద్దనపూడి సులోచనారాణి కథానాయికకు వుండే స్వాభిమానానికి తోడు స్త్రీ స్వేచ్ఛాభావ ఆలోచనలు, ఆర్థిక స్వాతంత్ర్య భావాలు వున్నాయి. సౌగంధిలో స్త్రీ స్వేచ్ఛకు, స్త్రీల ఆర్థిక స్వాతంత్రానికి సంబంధించిన ఆలోచనలు రేకెత్తటానికి ప్రేరణ జ్వాల. తల్లిదండ్రి విడిపోయి ఎవరికీ కాకుండా ఏకాకి అయిన జ్వాల 16 ఏళ్ళ వయసులో ప్రేమలో పడి గర్భవతి అయి, ఆ ప్రేమికుడు తప్పుకొంటే బిడ్డను

కని కూడా పెద్దవాళ్ళు ఆ శిశువును చంపేస్తే మళ్ళీ ఒంటరిదై, పెళ్ళంటే రోతతో తనలాంటి స్త్రీల కన్నీళ్ళు తుడవాలని తపన పడుతుంది.

ఇంటా బయట స్త్రీల మీద జరిగే దోపిడి పీడనల గురించి తన స్నేహితులకు ప్రబోధించి ఒక సంఘంగా ఏర్పడి పని చేయాలంటుంది. స్థానికంగా స్త్రీల మీద జరిగే పీడనలను ఊరేగింపుల ద్వారా, కరపత్రాల ద్వారా, పోస్టర్లు వేయటం ద్వారా వ్యతిరేకించే కార్యక్రమాలు నిర్వహిస్తూ ఒకసారి గుండాల దాడికి గురయి రేప్ చేయబడుతుంది. ఈలోగా ఆర్థిక స్వాతంత్ర్యం వుండాలని సౌగంధితో ఒక రెడీమేడ్ బట్టలషాపు పెడుతుంది. మధ్యలో కాశ్మీర్ వెళ్ళిపోయి హఠాత్తుగా అరవైఏళ్ళ వృద్ధుడ్ని పెళ్ళాడి తిరిగి ప్రత్యక్ష మవుతుంది. ఫెమినిస్టు కాస్తా ఫోర్జరీలు చేసి ఆస్తులు సంపాదించే రకంగా మారిపోయి నవల చివరికొచ్చేసరికి అందరి చేత ఛీకొట్టబడుతుంది. జ్వాలను ఈ విధంగా చిత్రించటం ద్వారా స్త్రీ విముక్తి ఉద్యమాలను అవమానించింది రచయిత్రి. జ్వాల పీడితస్త్రీ అయితే ఆమె పట్ల ప్రదర్శించాల్సినంత గౌరవం రచయిత్రి ప్రదర్శించలేదు. ఒకే సంఘటనలో సౌగంధి దెబ్బలు తిని పరుగెత్తుకొని వచ్చి ఇల్లు చేరితే జ్వాల సామూహిక మానభంగానికి గురి అయిందని వ్రాయటంలోనే రచయిత్రి 'భద్రవనిత'లను మరింత భద్రం చేయటం, ఒకసారి పెళ్ళికాకుండానే గర్భవతి అయి పిల్లలను కన్న స్త్రీ ఎన్నిసార్లయినా రేప్ చేయబడ వచ్చునన్నట్లు భావించటం కనబడతాయి.

సమకాలంలో బలపడుతున్న స్త్రీ విమోచనోద్యమాల మీద జ్వాల పాత్ర ద్వారా బురదచల్లే ప్రయత్నం చేశారు యద్దనపూడి. స్త్రీవిముక్తి ఉద్యమాలు స్త్రీలను పెళ్ళి చేసుకోకుండా నిరోధిస్తున్నాయని వ్రాయటం, జ్వాల ఉద్యమంలో భాగమైన పోస్టర్లు వేయటం, ఊరేగింపులు తీయటం లాంటివి ఎంత ప్రజాస్వామిక అభిప్రాయ వ్యక్తీకరణలో ఆలోచించనయినా ఆలోచించకుండా ఆ రకమైన పనులు సోగంధికి చిరాకే అనిపించాయి అని వ్రాయటం ఇదంతా ప్రజాస్వామిక ఉద్యమాల గురించిన అవగాహన సరిగా లేకపోవటం వల్లనే. ఇటువంటి ఉద్యమాలలో పనిచేసేవాళ్ళ జీవితాలకు భద్రత లేదన్న భయాన్ని పెంచి పోషించటానికన్నట్లు జ్వాల, సౌగంధి వెడుతున్న ఆటోని ఆపి ఎవరో వాళ్ళిద్దరినీ కొట్టారని, చేజిక్కిన జ్వాలను చెరిచారని వ్రాశారు యద్దనపూడి. పైగా స్వంత సమస్యలున్న

వాళ్ళే విముక్తి ఉద్యమాలంటూ వీధులలో పడతారని అలాంటి సమస్యలు లేకుండా అనుక్షణం తమను జాగ్రత్తగా చూచుకొంటూ తమకు కావలసిన నగలకు, చీరెలకు డబ్బులిచ్చే అత్తలు, తనేమి చేస్తానన్నా చేయనిచ్చే భర్తలు వున్న స్త్రీలకు విముక్తి ఉద్యమాలతో పనే లేదని ఈ నవల చెబుతుంది.

చల్లా సుబ్రహ్మణ్యం వ్రాసిన మిస్ ఇండియా (అక్టోబరు 1988) నవల కూడా స్త్రీవాద చైతన్యానికి అనుకూలతను ప్రదర్శిస్తున్నట్లుగా ప్రారంభమై, అంతిమంగా స్త్రీని వ్యాపార వస్తువుగా ప్రదర్శించటం వైపుకు సాగుతుంది. స్త్రీవాద చైతన్యం అభివృద్ధి చెందుతూ వున్న క్రమంలో మహిళలు వివిధ స్థాయిలలో తమమీద జరుగుతున్న పీడనను ఎదుర్కొనేందుకు సంఘటితమవుతూ, స్త్రీలను భోగ వస్తువులుగాను, వ్యాపార వస్తువులుగాను దిగజార్చే అందాల పోటీల పట్ల నిరసనను వ్యక్తం చేస్తున్న సమకాలీన సాంఘికోద్యమ నేపథ్యంలో ఆ నిరసనను, బహిష్కరణను కూడా వ్యాపార వస్తువుగా చేసుకొని వచ్చిన నవల 'మిస్ ఇండియా.' అందాల పోటీలను నిరసించడం అన్న పేరు మీద నవలంతా చేసిన పని అందాల పోటీలకు వెళ్ళదలచుకొన్నవాళ్ళు ఏమేమి జాగ్రత్తలు తీసుకోవాలో, శరీర సౌందర్యాన్ని ఎలా కాపాడుకోవాలో, పెంచి పోషించుకోవాలో చెప్పటం. గొప్ప వ్యాపారవేత్త అయిన ఆకాశ్ తను ఉత్పత్తి చేసే 'కాస్మటిక్స్'కు ప్రచారం కల్పించేందుకు మోడల్స్ కోసం అందాల రాణులను తయారు చేస్తాడు. అట్లా చేయటంలో అతడు వాళ్ళను తన సెక్సువాంఛలకు వాడుకోడని, వాళ్ళ నగ్న శరీరంలో అతను తనకు కావలసిన శరీరపు కొలతలే వెతికాడని చెప్పటం ద్వారా ఈ నవల స్త్రీలో అందాన్ని వెతకటంలో, గుర్తించటంలో 'నిజాయితీని' గురించి నొక్కి చెప్పటానికి ప్రయత్నించింది. స్త్రీ సౌందర్యాన్ని సహజంగా అభివృద్ధి చేసుకోవాలా .... కృత్రిమ పద్ధతులలోనా అన్న ప్రశ్నలు వేయించి రచయిత నవల చివరికొచ్చేసరికి సహజంగానే సౌందర్యాన్ని అభివృద్ధి చేసుకోవాలని ప్రతిపాదిస్తాడు. దానికి అనుగుణంగానే నాయకుడు తన కాస్మటిక్స్ ఇండస్ట్రీనంతా రద్దుచేసి పారేసి, కేవలం మూలికలతో సౌందర్య సాధనాలను తయారుచేసే సరికొత్త ఇండస్ట్రీ స్థాపించటానికి నిశ్చయించుకొంటాడు.

వ్యాపార నాగరికతను ప్రశ్నించకుండా, స్త్రీని అందంతో కొల వాల్సిన అవసరమేమిటన్న జిజ్ఞాస చేయకుండా, సామాజిక ఉత్పత్తి రంగాలలో భాగస్వాములయి ప్రవర్తించే చైతన్యాన్ని స్త్రీలకు కలిగించకుండా కేవలం పైపై మాటలుగా అసంబద్ధ అసహజ ప్రయత్నాలుగా, అందాల పోటీల గురించి వ్యతి రేక చైతన్యాన్ని పెంచుతున్నాను ఈ నవల ద్వారా అని రచయిత భ్రమ పడ వచ్చు గాక! కానీ, పాఠకులందరూ అమాయకులు కారు. అజ్ఞానులు అంతకంటే కారు. అందాల పోటీలను నిరసించటం పేరుమీద రచయిత వాటికెంత ప్రాధా న్యత నిస్తూ సమర్థించ బూనుకొన్నాడో, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థను ఎంత అనుకూల దృక్పథం నుండి ప్రదర్శించాడో ఈ నవల చదివి అర్థం చేసుకోగలరు.

స్త్రీ వాద దృక్పథాన్ని, మహిళా ఉద్యమాలను ఈ విధంగా వక్రీకరించి వ్యాపారీకరించే ఈనాటి పరిస్థితులలో నిజాయితీపరులైన రచయితలు, సమగ్ర జీవితదృష్టి కలిగిన రచయితలు కావాలిప్పుడు. లైంగిక వివక్ష మానవ సంబం ధాలను, ముఖ్యంగా స్త్రీపురుష సంబంధాలను ఎంతగా నిర్వీర్యం చేస్తుందో, అమానవీయం చేస్తుందో స్త్రీ పురుషులిద్దరికీ అర్థమయ్యేవిధంగా స్త్రీవాద దృక్ప థాన్ని వస్తువుగా చేసుకొని వివిధ కోణాలనుండి ప్రదర్శిస్తూ నవలలు వ్రాయాలి. అలాంటి నవలలు స్త్రీ పురుషులిద్దరికీ తాము జీవిస్తున్న జీవితంలోని జీవరాహిత్య లక్షణాన్ని అవగాహనకు తెచ్చి సిగ్గుపడేట్లు చేయటమే కాక, ఆ రకమైన జీవి తాన్ని మార్చుకోవటానికి వీలుగా పితృస్వామ్యంపైన, అసమ ఆర్థిక వ్యవస్థపైన ఏకకాలంలో వ్యతిరేకోద్యమాన్ని నిర్మించుకోవటానికి ప్రేరణనిస్తాయి. నూతన మానవ సంబంధాల నిర్మాణాన్ని కోరటం వల్ల స్త్రీవాద దృక్పథం నవలను సారంలో సాహిత్య సామాజిక ప్రక్రియగా పదునెక్కించగలుగుతుందన్న ఆశాభావాన్ని ఇటీవలి నవలల్లోని స్త్రీవాద ధోరణుల ప్రతిఫలనం - కలిగించ గలుగుతున్నది.

# తెలుగు కథ – స్త్రీవాద ధోరణులు

—వి. రామలక్ష్మి (కె. బి. లక్ష్మి)

తెలుగు కథ ఆధునిక ఆంధ్ర రచనావికాసానికి ఒక మచ్చుతునక. మనిషితోపాటే కథ పుట్టింది. ఇతర సాహితీ ప్రక్రియలన్నీ కథ తర్వాతే వచ్చాయనడానికి శక్తివంతమైన ఆధునిక తెలుగు కథాసాహిత్యమే తార్కాణం. నేటి కథ ఎంత ఆదునికమో దాని చరిత్ర అంత ప్రాచీనం.

మహాకవి గురజాడ చేతిలో 1910 లో 'దిద్దుబాటు' కథతో రూపుదిద్దుకున్న కథానిక ప్రక్రియా విధానంలో ఆనాటినుంచి ఈనాటి వరకు అనేకానేక పోకడలు పోయింది. దిక్సూచి వంటి తెలుగు కథ గురజాడ చేతిలో పుట్టడం దాని అదృష్టం.

మన కథ తెలుగు జాతి జన జీవితాన్ని చిత్రించడంలో కృతకృత్యమైంది అని చెప్పడానికి శ్రీయుతులు మొక్కపాటి నరసింహశాస్త్రి, చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చలం, మునిమాణిక్యం నరసింహారావు,, కొడవటిగంటి, బుచ్చిబాబు, తిలక్, కాళీపట్నం రామారావు, మధురాంతకం రాజారావు, అరవింద, ఆచంట శారద, శివరాజు సుబ్బలక్ష్మి, రంగనాయకమ్మ, ఇల్లిందల సరస్వతీదేవి, వాసిరెడ్డి సీతాదేవి మొదలయిన అనేకమంది వ్రాసిన కథలే నిదర్శనం.

కథ అంటే జీవితం. జీవితంలో స్త్రీ పురుషులు, పిల్లలు, ప్రకృతి ధర్మాలు, వికృత ధోరణులు ఎన్నో వుంటాయి. అయితే, జీవితంలో సగభాగమైన స్త్రీలకు సమస్యలు ఎక్కువగా వుండడం శోచనీయం. అందుకు సామాజిక కట్టుబాట్లు, కుటుంబ పరిస్థితులు, వ్యవస్థ, వ్యక్తుల ఆలోచనా సరళి, సంప్రదాయాలు, ఆచారాలు - ఇలా కారణాలు అనేకం. ఆనాటి సమాజంలోని స్త్రీలకు అవసరమైన స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహం, బాల్యవివాహాల వ్యతిరేకత, భర్తకు

భార్య విషయంలో నడుపవలసిన ధర్మాలు, చదువురాని స్త్రీలు తమ బిడ్డలకు శత్రువులు, దేహారోగ్యం, నిర్బంధ వైధవ్యం, భార్యాభర్తల ఐకమత్యం మొదలయిన అనేకానేక స్త్రీల సంబంధిత, స్త్రీలకు ఉపయుక్తమయిన విషయాలను ప్రస్తావిస్తూ రచనలు చేసిన స్త్రీ జనోద్ధారకుడు కందుకూరి.

"స్త్రీలకు ఉపయోగించు కథలు" అన్న పేర పంతులుగారు ప్రకటించిన ల్యాంబ్ కథలను అనుసరించి కొన్ని కథలు వెలువడ్డాయి. తెలుగునాట రచయిత్రులను తయారు చేసిన ఘనత, స్త్రీలకు ప్రత్యేక ప్రతిపత్తిని చేకూర్చి వారికోసం ప్రత్యేకంగా 1883 లో 'సతీహితబోధిని' అనే పత్రికను స్థాపించిన ఘనత కందుకూరి వీరేశలింగం పంతులుగారిదే. అలా స్త్రీల పరంగా ఓ సంస్కర్తగా ఆయన సమాజాన్ని, దాని లక్షణాలను దర్శించారు.

ఆనాటి సాంఘిక దురన్యాయాలకు బలయిపోతున్న మహిళలను ఉద్ధరించేందుకు సాహిత్యాన్ని ఆయుధంగా చేసుకున్నారు నాటి రచయితలు. స్త్రీలలో విద్య, చొరవ తక్కువవడం వల్ల పురుషులే వారి ఉద్ధరణకు ముందుకు రావల్సి వచ్చింది. అలా వచ్చిన వారిలో కందుకూరి తర్వాత అసలుసిసలయిన మహిళా శ్రేయోభిలాషి శ్రీ గురజాడ అప్పారావు.

గురజాడ కథలన్నీ ఇంచుమించు స్త్రీ సమస్యలకు సంబంధించినవే. ఈ సమస్యలను ఆయన అనేక దృక్కోణాలనుంచి నిశితంగా పరిశీలించారు. సాంఘిక అవినీతి క్రిములతో నిండిన దుర్భరదాస్యం నుండి మహిళలను కాపాడ్డానికి సమాజాన్ని అప్రతిష్టపాలుచేసే పరిస్థితిని కళ్ళ ఎదుట పెట్టి, నైతికభావాల ఉన్నత ప్రమాణాల్ని ప్రాచుర్యానికి తేవడం కంటే సాహిత్యానికి ఉత్తమ ప్రయోజనం ఏదీ వుండదన్న గురజాడ ఉద్ఘోష అతని రచనల్లో ప్రతిచోటా కనిపిస్తుంది.

కన్యాశుల్క వివాహాలు, వేశ్యావృత్తి, వేశ్యల వివాహ సమస్య, యౌవనంలో వున్న భార్యలతో ముసలిభర్తల కాపురం, వితంతు వివాహాలు, ఎక్కువ వయసు తేడాతో జరిగే పెళ్ళిళ్ళ వల్ల వైధవ్యాలు, వాటి ఫలితంగా జరిగే వ్యభిచారాలు, గర్భస్రావాలు, అంతర్వర్ణ వివాహాలు, స్త్రీలపైన జరిగే అత్యాచారాలు, ఆత్మరక్షణ కోసం స్త్రీల ఆయుధ ధారణ, స్త్రీవిద్య, వంటింటి చాకిరీ నుండి స్త్రీకి విముక్తి.... ఇటువంటివన్నీ ఆయన లోలోతులకుపోయి ఆలోచించిన విషయాలు.

'దిద్దుబాటు' 'దేవుడు చేసిన మనుషుల్లారా! మనుషులు చేసిన దేవుళ్ళారా! మీ పేరేమిటి?' 'మెటిల్డా' 'సంస్కర్త హృదయం' 'మతం', విమతం'. ఒక నవలకు స్థూలరూపమయిన అసంపూర్తి రచన సౌదామిని మొదలయిన గురజాడ రచనల్లో ఒక్క మతం, విమతం తప్ప మిగతా కథ లన్నింటిలోనూ స్త్రీల సమస్యల ప్రస్తావన వుంది. పరిష్కారాల సూచన వుంది.

దిద్దుబాటు కథ 1910 లో 'ఆంధ్ర భారతి' పత్రికలో వచ్చింది. ప్రధాన వస్తువు స్త్రీవిద్య. భార్య కమలిని చదువుకున్న యువతి. చదువువల్ల అబ్బిన సంస్కారం, జ్ఞానంతో వేశ్యల ఆకర్షణలో పడ్డ భర్తను నేర్పుగా తనవైపు తిప్పుకున్న ఇల్లాలి కథ. 1910 నాటికి బ్రాహ్మణ కుటుంబాల్లో స్త్రీలు చదువు కోడం అన్నది అబ్బురం.

ముసలి పులిగా పేరుపడిన వృద్ధ భర్తచేతిలో చిక్కుకున్న అందమైన పడుచు పెళ్ళాం పడేపాట్లు, ఆవిడ దైన్యస్థితి, అనుమానంతో ముసలిభర్త పెట్టే హింసలు, చేసే అవమానాలు 'మెటిల్డా' కథలో వున్నాయి. ఈనాటికీ చర్చనీయాంశంగానే మిగిలిపోయిన స్త్రీ స్వేచ్ఛను, పురుషదురహంకారాన్ని నిలదీసి ప్రశ్నించే కథ మెటిల్డా.

'సంస్కర్త హృదయం' కథలోని సరళ అనే వేశ్యపాత్ర కొంతవరకు కన్యాశుల్కంలోని మధురవాణి పాత్రలాంటిదే. గత్యంతరంలేక చేస్తున్న వేశ్యా వృత్తి, పెళ్ళిచేసుకుని సంసారిగా జీవించాలన్న కోరిక, అది ఎలా నెరవేర్చు కోవాలో తెలీని తికమక, వేశ్యల్ని వుద్ధరించాలని సత్సంకల్పం వున్న ప్రొఫెసర్ చివరికి ఏమిచేయలేక తానే చతికిలబడిపోవడం సంస్కర్త హృదయంలోని సంగతులు. నిజానికి కథలోని ప్రొఫెసర్ హృదయం మంచిది. కానీ మనస్సు పటుత్వం వున్నది కాదు. అయితే మధురవాణిలా సంస్కర్త హృదయంలోని సరళ రంగనాథయ్యర్‌ను "నావంటి భోగంపిల్లను ఏ మర్యాదస్తుడు పెళ్ళాడు తాడో చెప్పండి మీరే?" అని నిలదీస్తుంది. సమాధానాన్ని భవిష్యత్తుకు వది లేశాడు. తర్వాత దాన్ని చలం అందుకున్నాడు.

"సౌదామిని"లో ముఖ్యంగా గమనించవల్సింది పురుషుడి దౌర్జన్యం నుండి ఆత్మరక్షణ కోసం స్త్రీ కత్తిసాము నేర్చుకోవాలన్న ప్రతిపాదన, వంటింటి

చాకిరీ నుండి స్త్రీకి విముక్తి జరగాలంటే కుటుంబ ఆహార అవసరాలు తీరడానికి జరగాల్సిన ఏర్పాట్ల ప్రస్తావన- ఇవన్నీ గురజాడ కాలంలో వూహించడానికయినా వీలుకానివి.

"స్త్రీ లేచి తిరగబడాలి, సృష్టిలో వున్నతురాలు స్త్రీ, ఆమె అబల అనే మాట అర్థరహితం. మన దేశంలోని రైతు కుటుంబాల్లోని స్త్రీ పొలంలో కునికి పాట్లు వడే పురుషుని కంటే బలమైంది. నాట్లు వేసేది, పత్తి ఏరేది, వడ్లు దంచేది స్త్రీలేగా! శ్రామికవర్గ స్త్రీలేగాక నాగరక స్త్రీలు కూడా శ్రమిస్తారు, బైటికి వెళ్ళే ప్రతి స్త్రీకి పురుషుల క్రూరత్వాన్ని ఎదుర్కొనేందుకు రివాల్వర్, బాకు ఏదో ఒక ఆయుధం వుండాలి.

"స్త్రీ వంట చేయడాన్ని నిషేధించి పారెయ్యాలి. దుకాణం నుంచి ఆహారం తెచ్చుకోవాలి. ఆ ఆహారాన్ని వెచ్చబెట్టడానికి అవసరమైన సామగ్రిని మాత్రం ఇంట్లో వుంచుకోవాలి. ప్రతి వీధికీ ఒక దుకాణం వుండాలి. కుటుంబ సభ్యులంతా అక్కడికి వెళ్ళి భోం చేయాలి. ఇక వంటా వార్పూ చింతే వుండదు. ఇట్లా చేయడంవల్ల ఎంతో శక్తి పొదుపవుతుంది. పేదవాళ్ళు ఆ విధంగా ఆహారం కొనుక్కోలేరుకదా అన్న ప్రశ్నకి తావే లేదు. అసలు సమాజంలో పేదా గొప్పా తారతమ్యమే వుండకూడదు. అనారోగ్య కారణంగాగాని మరే ఇతర విపత్తువల్ల గాని ఉపాధి కోల్పోయిన భార్యకుగాని, భర్తకుగాని ప్రభుత్వమే ప్రత్యేక వనరులు కల్పించాలి" మొదలయిన అంశాలెన్నో సౌదామిని కథ నిండా వున్నాయి. అప్పటికీ ఇప్పటికీ ఎనిమిది దశాబ్దాలు పైగా గడిచాయి. ఇపుడు అవి అనూహ్యాలు కావు. కానీ సాంఘిక న్యాయం అమలు జరుగుతున్న దేశాల్లో మాత్రమే ఆచరణ సాధ్యాలు. అపుడే గురజాడ ఇవన్నీ ఆలోచించారంటే ఆయన దృష్టి సరిహద్దులేనిదన్నమాట!

"ఈ సమాజంలో స్త్రీల కన్నీటి గాథలకు కారణం నాకు తెలుసు, తిరిగి వివాహమాడకూడదనే నియమం. విడాకుల హక్కులు లేని కారణం, ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడం స్త్రీల కన్నీటి గాథలకు ప్రధాన హేతువులు" అని వివరిస్తూ, "ఆధునిక మహిళలు భారతదేశ చరిత్రను తిరగ రాస్తారు" అన్న ఆశాభావం అప్పట్లోనే వెలిబుచ్చారు గురజాడ. ఆయన భావాలకు అంత

విస్తృతి, స్పష్టత వుండబట్టే ఆ రచనలు తర్వాతి కాలంలో రచయితలకు మార్గ దర్శకాలై, ఈనాటికీ చర్చనీయాంశాలుగా సజీవంగా వున్నాయి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, ముద్దుకృష్ణ, చేకుమళ్ళ కామేశ్వరరావు, కరుణకుమార మొదలయిన రచయితలు గురజాడ తడిమిన ఒక్కొక్క అంశాన్ని లోతులకు పోయి పరిశీలించి కథలు రాశారు.

శ్రీపాద 'కీలెరిగినవాత' కథ స్త్రీలకు చదువువల్ల కలిగే ఆత్మ స్థయిర్యాన్ని ప్రధాన వస్తువుగా తీసుకుని రాసిన కథ. స్త్రీ తన కాళ్ళ మీద తాను నిలబడ్డానికి విద్య అవసరమని, అది లేకుంటే పురుషుల చేతుల్లో బానిస కాక తప్పదని హెచ్చరించే కథ. 'అన్నంత పనీ జరిగింది', 'కొత్త చూపు' మొదలయిన శ్రీపాద ఇతర కథల్లోను; చేకుమళ్ళ కామేశ్వరరావు 'మొగుడు పెళ్ళాం కబుర్లు' 'విద్య వింత పశుత్వం' తదితర కథల్లోను విషయం ఇదే. శ్రీపాద వారివే 'అరికాళ్ళ కింద మంటలు' 'తల్లి ప్రాణం' 'ఇల్లు పట్టిన విధవాడ పడుచు' స్త్రీల సమస్యలను చర్చించిన ముఖ్యమైన కథలు. అలాగే ముద్దుకృష్ణ రచించిన 'కాలం కల్పించే మార్పు' 'తెలివి' మొదలయినవి.

'అరికాళ్ళ కింద మంటలు' 'కాలం కల్పించే మార్పు' కథల్లో నేరుగా ఎవరి ప్రోద్బలం లేకుండా స్త్రీలు తమంత తామే ధైర్యం చేసి నిర్ణయాలు తీసుకుంటారు. 'కాలం కల్పించే మార్పు'లో అంతా అయోమయంగా ఉన్న ఓ యువకుడికి పరోక్షంగా కర్తవ్య నిర్దేశం చేసిన వితంతు యువతి ముఖ్యపాత్ర. వీటి కన్నా శ్రీపాద వారి 'తల్లి ప్రాణం' మరింత స్పష్టమైన కథ. తనకు పాఠాలు చెప్పడానికి వచ్చే మేష్టార్ని వరించి వివాహం చేసుకుంటానన్న వితంతు యువతిని ఆమె తల్లే ఆశీర్వదిస్తుంది. తండ్రీ అంగీకరిస్తాడు. సమాజంలో వస్తున్న మార్పులకది ప్రతీక.

అలాగే శ్రీపాద 'కొత్త చూపు', 'అన్నంత పనీ జరిగింది' వగైరా కథల్లోని అమ్మాయిలు అబ్బాయిలకంటే నాలుగు ఆకులు ఎక్కువ చదివి, పదడుగులు ముందుకి వేస్తారు. అగ్రహారీకుల అమ్మాయి పెళ్ళిచూపులు చూడ్డానికి వచ్చిన పెళ్ళికొడుకుని నిలదీసి ప్రశ్నించేసరికి అతను వెనక్కి తిరిగి చూడకుండా

పారిపోతాడు. అక్కడితో ఆగని ఆ అన్నపూర్ణ తన ఇంటి ఆవరణలో సాము గరడీలు నేర్చుకునే తాలింఖానాలాంటిది ఏర్పాటు చేసి మగవాళ్ళతో కుస్తీ పడుతుంది. ఇదంతా అగ్రహారం నడిబొడ్డున సాగడం గమనార్హం. ఆ కాలానికి అదెంతో గడుసుతనం, మగరాయుడితనం.

అయితే, స్త్రీ సమస్యల పట్ల భిన్న దృష్టిని సారించినవాడు గుడిపాటి వెంకటచలం. వితంతు వివాహాలు జరిపిన పద్ధతి పట్ల మొదట్నించీ చలానికి అసంతృప్తి వుంది. వివాహ వ్యవస్థనే ప్రశ్నించే చలానికి వితంతువుల్ని ముక్కూ మొహం తెలీని వాళ్ళకిచ్చి ఆర్భాటంగా మళ్ళీ పెళ్ళిచేసి చేతులు దులుపుకోవడం అనాగరికంగా కనబడింది. అందుకే ఆయన కథల్లో వితంతువులున్నా, వారి దయనీయ స్థితికి తక్షణ కారణం వైధవ్యమే అయినా అంతకన్నా ప్రధానంగా ఈ దేశంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని ఎత్తిచూపాడు చలం.

చలం కలానికున్న వాడి, వేడి అపూర్వమైనవి. స్త్రీ పురుష సంబంధాల పట్ల, కుటుంబ జీవనం పట్ల కొన్ని నిర్దుష్టమైన అభిప్రాయాలు వున్నవాడు, స్వంత అభిరుచులు, ఆకాంక్షలు వ్యక్తం చేసుకోడానికి, శరీరవాంఛ తీర్చుకోడానికి సమాజంలో స్త్రీకి గల అవరోధాలన్నింటినీ ఆయన ఎదిరించాడు. స్త్రీ పురుషులు- ముఖ్యంగా స్త్రీలు వ్యక్తిత్వ వికాసంకోసం చేసే ప్రయత్నాలన్నింటినీ సమర్థించాడు. తనకు నచ్చినది ఇతరులకు విడ్డూరమనిపించినా ఆచరణలో చూపాడు. 'స్త్రీ' 'బిడ్డల శిక్షణ' స్త్రీల కోసం ప్రత్యేక శ్రద్ధతో రాశాడు.

'శేషమ్మ' 'వాణీ ఎ స్టడీ' 'అనసూయ' కథల్లో చలం స్వేచ్ఛాభావాలు మరింత స్పష్టంగా దర్శనమిస్తాయి. వీటిల్లో ప్రేమ, వివాహ వ్యవస్థను గూర్చిన చిత్రణ ప్రధాన ఇతివృత్తాలు. అందుకే గురజాడ మెటిల్డా చేయలేని తిరుగుబాటు చలం స్త్రీ చేస్తుంది. చలం భావాలు వివాహ వ్యవస్థలో నెలకొన్న దుర్భరత్వాన్ని, పురుష దురహంకారాన్ని నిలదీసి ప్రశ్నిస్తాయి. స్త్రీ స్వేచ్ఛకు చలం ప్రతినిధి అయ్యాడు.

తెలుగు సాహిత్యంలో సజీవపాత్ర కాంతాన్ని సృష్టించిన మునిమాణిక్యం నరసింహారావు గారు ఆనాడు మహోధృతంగా చెలరేగుతున్న చలం గారి

ప్రభావానికి అనకట్ట కట్టారు. ఈయన ధోరణి దాదాపు చలానికి పూర్తిగా వ్యతిరేకం. మునిమాణిక్యం కథలనిండా దాంపత్య జీవితంలోని అందచందాలు అతి రమ్యంగా ప్రదర్శించబడ్డాయి. స్త్రీ పురుషులు కోరుకునే ప్రేమ, సౌఖ్యం అందుకోడానికి ఎక్కడికో పోనక్కర్లేదు. నేర్పుగా అందుకునేవారికి అది ఇంట్లోనే లభ్యమౌతుంది అని నిరూపించినవాడాయన. అందుకు ఆలంబన ఆయన సృష్టించిన 'కాంతం.' కల్పిత పాత్ర అయినా ఆ కాంతం మునిమాణిక్యంగారి భార్యే అని పాఠకులు అనుకునేంత సహజంగా, హుందాగా వుంటుంది. తెలుగు ఆడపడచులకి ఆవిడపాటి జ్ఞానం వుంటే దాంపత్య జీవితాలు మరెంత రమ్యంగా వుండేవో కదా! అనిపిస్తుంది. అందుకు 'దాంపత్యోపనిషత్తు' ఒక్కటి చాలు ఉదాహరించడానికి. ఆయన 'పిల్లలుగల ఇల్లు' కుటుంబ వ్యవస్థను పటిష్ఠంగా ప్రస్ఫుటించిన కథ.

స్త్రీ పురుషుల మనస్తత్వాల్ని, ప్రవర్తనల్ని అత్యంత సూక్ష్మంగా పరిశీలించిన రమ్యమైన రసవత్కథలు బుచ్చిబాబువి. 'పొగలేని నిప్పు' కథ చాలు ఆయన స్త్రీవాద ధోరణి తెలుసుకోడానికి. 'ఆమె నీడ', 'నా గాజుమేడ', 'మేడ మెట్లు' 'అడవికాచిన వెన్నెల' కథలు బుచ్చిబాబు స్త్రీ మనస్తత్వ పరిశీలనకు మచ్చుతునకలు.

ఇక రచయిత్రుల కథలు ముందు సాంసారిక జీవితాలకు దగ్గరగా కుటుంబంలోని సంఘటనలకు, సన్నివేశాలకు ప్రతిబింబాలుగా మొదలై- స్త్రీ సమస్యలు చర్చించడం దగ్గర్నించి, సాంఘిక సమస్యలను చర్చించేదాకా వచ్చాయి.

కొమ్మూరి పద్మావతి, ఇల్లిందల సరస్వతీదేవి కథలు ఉమ్మడి కుటుంబాల్లోని కష్టనష్టాలనుండి, భర్తచాటు భార్యాత్వం నుండి బైటపడాలనుకునే స్త్రీల మనస్తత్వాల్ని, బిడ్డల బాధ్యతపట్ల తపనని ప్రతిబింబించాయి.

రంగనాయకమ్మగారి రచనల్లో స్త్రీలను జాగృతం చేసే స్త్రీవాదం తారాస్థాయిలో కనబడుతుంది. జీవితం పట్ల స్పష్టమైన అవగాహన, సమాజం మీద తిరుగుబాటు చేసే ధోరణి, సంప్రదాయాల్ని, మూఢ నమ్మకాల్ని, కొండొకచో ఆచారాల్ని తోసిరాజనే గుండె ధైర్యంవున్న స్త్రీలు రంగనాయకమ్మ కథల్నిండా

వున్నారు. 'ఆర్తనాదం' 'మనమిద్దరమే ఉందాం' 'విజయ' వంటి కథలు ఆమె ఆలోచనా సరళికి అద్దం పడతాయి. స్త్రీ బానిస బతుకును నిరసిస్తూ, సాంఘిక దురాచారాలకు బలైన స్త్రీకి వ్యక్తిత్వాన్నిస్తూ, పురుషుని అమానుషాన్ని ఖండిస్తూ ఎన్నో పాత్రల్ని సృష్టించింది రంగనాయకమ్మ.

స్వాప్నిక జగత్తు నుండి పాఠకుల్ని భూమి మీదకి దింపి, వర్తమానాంధ్ర సమాజ జీవితంలో స్త్రీ సాధించవలసిన ఔన్నత్యం, వాస్తవికతలను ప్రదర్శించేలా సామాజిక సమస్యలను కథా వస్తువులుగా స్వీకరించి రచనలు చేశారు వాసిరెడ్డి సీతాదేవి.

ఆధునిక స్త్రీ సమస్యలకు; పెళ్ళి, పెళ్ళిపట్ల వారి మనస్తత్వానికి అద్దం పట్టే కథలు పరిమళా సోమేశ్వర్‌వి. వాటిలో 'క్రోటన్ మొక్కలు' కథ విశిష్టమైంది. ఇదే కోవకు చెందిన వాచస్పతి 'రంగుటద్దాలు' కథలో కూడా కట్నం ఇచ్చుకోలేని ఆర్థిక అసమర్థతతో బాటు, ఆడపిల్లలు వచ్చిన సంబంధాల్ని ఏదో కారణంగా కాదనడం, చేతులారా జీవితాన్ని జారవిడుచుకోడం స్పష్టమవుతుంది.

సామాజిక స్త్రీ జనోద్ధరణకు కలం పట్టానని ధైర్యంగా చెప్పుకుని రచనలు చేసిన చలం శిష్యురాలు తెన్నేటి హేమలత స్త్రీ సెక్స్ జీవితానికి సంఘం విధించిన కట్టుబాట్లను నిర్భయంగా ఎదిరించి రచనలు చేశారు.

యద్దనపూడి సులోచనారాణి కలల్లో తేలించే కథలు రాసినా ఆవిడ హీరోయిన్లు ఏ సందర్భంలోనూ ఆత్మగౌరవాన్ని, ఆత్మాభిమానాన్ని వదులుకోలేదు.

నిత్య జీవితంలోని దుర్భర దాస్యం నుండి విముక్తి కోరుకునే స్త్రీలు, స్వతంత్రంగా ఆలోచించి, స్వేచ్ఛాభావాలను బాహాటంగా చెప్పే స్త్రీలు అబ్బూరి ఛాయాదేవి, తురగా జానకీరాణి, పవని నిర్మల ప్రభావతి, అరవింద, అచంట శారదాదేవి, శీలా సుభద్రాదేవి కథల్లో ప్రత్యక్షమౌతారు.

కె. రామలక్ష్మి పార్వతి తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ, భర్తకంటే తనదే పైచేయిగా చేసుకుంటూ కూడా సాంసారిక జీవితపు సొబగులు పాఠకులకు రెండు చేతులా పంచుతుంది. అలాగే ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారి సుజాత

కె. రా. పార్వతిని మించిన గడసరి. ఈ రెండు పాత్రలు కూడా భర్తలతో పూర్తిగా ఏకీభవించకుండానే స్పష్టమైన తమ ఆలోచనా సరళితో వారిని ఒప్పించి కుటుంబంలో సామరస్యం నెలకొల్పే దిట్టలు.

పి. సత్యవతి 'మాఘ సూర్యకాంతి' 'ఇల్లు అలకగానే' కథలు స్త్రీవాదంలో చెప్పుకోతగ్గవి. జానకీరాణి 'జగన్మాత' కథలో అవివాహిత తల్లి అవడం, వ్యక్తికంటే మాతృత్వం గొప్పదని చెప్పడంతో అద్భుతంగా ముగుస్తుంది కథ.

ఇటీవలి శ్వేత రాత్రులు కథాసంపుటిలోని గోపి భాగ్యలక్ష్మి 'జింగుబాయి' కథలో ఒక గోండు యువతి గూడెం ఆచారాల్ని, కట్టుబాట్లను ధైర్యంగా ఎదిరించి మారుమనువు చేసుకుంటుంది.. ఆ కుల, కట్టుబాట్లలో ఇలాంటి వ్యతిరేకత అరుదైన విషయం. సాక్షరత సాక్షిగా వారిలో ఇలాంటి మార్పు హర్షణీయం.

శీలా సుభద్రాదేవి 'పచ్చగడ్డిలో పల్లేరుకాయలు' 'కంచికి వెళ్ళని కథ'ల్లో గృహిణి, ఉద్యోగిని ఇద్దరి సమస్యల విశ్లేషణ వుంది. 'ఈ దారి ముందుకే' అన్న కథలో ఒంటరిగా సమాజంలో ధైర్యంగా తమకిష్టమైన జీవితాన్ని ఎన్నుకునే స్త్రీలకు కొండంత ఆత్మవిశ్వాసం కలిగిస్తుంది.

ఇంద్రగంటి జానకీబాల కల్యాణ వేదికలోని సులోచన, యార్లగడ్డ నిర్మల 'ఎదురు చూపులు'లోని సత్యవతి, సుభద్ర, సుధ స్త్రీవాదానికి ప్రతీకలు.

అయితే, సమాజంలో సగభాగమైన స్త్రీజాతి నిర్వీర్యతను త్రోసి రాజంటూ వారి ఆర్తనాదాలకు కొత్త భాష్యం చెప్పే ప్రయత్నం మెల్లమెల్లగా చోటు చేసుకుంటూ స్త్రీవాద కథలు వెలువడుతున్నాయి. పురుషాధిపత్యంలో ఘనీభవిస్తున్న స్వేచ్ఛా సమానత్వాలను ఉద్ధరించాలన్న ధోరణి ఎక్కువగా కనబడుతోంది. ఆనాటి చలం స్వేచ్ఛావాదం ఈనాటి సమాజానికి ఆపాదించే తీవ్ర ప్రయత్నం ఈ ధోరణి కథల్లో కనబడుతోంది. అయితే, ఒక పరిధిలో వెలువడుతున్న స్త్రీవాద కథలు వారనుకున్నంత ప్రయోజనాన్ని సాధించలేకపోతున్నాయి.

స్త్రీవాద రచయిత్రులుగా రచనలు చేస్తున్న ఓల్గా, ఇటీవలి కాలంవరకూ స్త్రీవాద కవిత్వం రాసి ఇపుడిపుడే కథలవైపు కలం మళ్ళించిన కొండేపూడి నిర్మల

కథలను పరిశీలిస్తే, ఈ ఇరుకు చట్రాన్ని తప్పించుకున్న ఓల్గా 'భద్రత', నిర్మల 'అతని భార్య' మంచికథలు. భద్రతలో ప్రేమ,ఒక మగవాడితో సంబంధం వాటి గురించిన అనుభూతులను అనుభవాలను తనెందుకునిరాకరించాలి.అన్న ఆలోచనతో 35 ఏళ్ళ అవివాహిత సుజాత పెళ్ళయి భార్య, ఇద్దరు పిల్లలు వున్న రాజారావును జీవితంలోకి ఆహ్వానిస్తుంది. అనాకారి భార్య వున్నవాడే పర స్త్రీ వ్యామోహంలో పడతాడనుకున్న సుజాత నమ్మకాన్ని వమ్ముచేస్తూ అతని భార్య ధనలక్ష్మి సుజాతని మించిన అందంలో హుందాగా వుండడం ఆమెను ఆశ్చర్యపరుస్తుంది. తర్వాత తర్వాత ఒక మగాడికి రెండో స్త్రీగా వుండడంలోని క్షోభను అర్థం చేసుకుని ధనలక్ష్మితో చేయికలిపి, ఇద్దరూ ఆ సదరు భర్తను వంటరిగా వదిలేసి తమ జీవితాలకు తామే కర్తలం అని తెలుసుకోడంవల్ల వచ్చిన భద్రతాభావంతో జీవితం గడపడం ఇతివృత్తం.

స్త్రీ వ్యక్తిగత జీవితం రాజకీయమేనన్న స్త్రీవాద దృక్పథంతో రాసిన ఓల్గా రాజకీయ కథల్లోని స్త్రీవాద ధోరణి సమస్యల్ని విశ్లేషిస్తుంది.

కొండేపూడి నిర్మల 'అతని భార్య'లో భార్య తన ప్రతిభను మరుగున పడేసుకుని భర్త సంగీత సాధనకు దోహదం చేసి అతనికి కీర్తిప్రతిష్టలు చేకూర్చ డంలో తలమునకలవుతుంది. తన వ్యక్తిత్వాన్ని అస్తిత్వాన్ని కోల్పోయి అతని భార్యగా, కేవలం అతని భార్యగా మిగిలి పోవాల్సిన స్థితిలో ఆమెలో వివేకం మేల్కొంటుంది. నిర్మల ఇతర కథల్లోని స్త్రీవాద ధోరణి కూడా ఇదే తరహాలో సాగుతుంది.

స్త్రీవాద రచన అని పేరు పెట్టుకోకుండా ఎందరో కథకులు స్త్రీల సమ స్యల్ని ఇతివృత్తాలుగా చేసుకున్నారు. అయితే, స్త్రీవాద కథలగురించి ప్రత్యే కంగా రావల్సినంత విమర్శలేదు. అన్ని కథలుకూడా లేవు. ఉన్నంతలో మంచి విమర్శలు వస్తే మరింత పదునెక్కిన స్త్రీవాద కథా సాహిత్యం వెలువడే అవ కాశం వుంది.

ఏదిఏమైనా, స్త్రీవాదం (ఫెమినిజం)లో వున్న ప్రత్యేకత ఏమిటంటే - జీవితంలోని కొత్త అంశాల్ని చూపడం, కొత్త దృష్టిని అలవరచడం. నేటి

సమాజంలో కూడా స్త్రీ పురుషుల సాహచర్యం పురుషుల ఆధిక్యతనే నిరూపిస్తోంది. తమ వునికిని నిలబెట్టుకోవాలనుకునే స్త్రీలు ఇటువంటి సాహచర్యాన్ని కోరరన్న విషయం కొన్ని రచనల్లో స్పష్టంగా కనబడుతోంది.

అయితే, స్త్రీలు సంసారంలో పడితే మనుషులు కాకుండా పోతారేమో! అని భయపెట్టే కథలు, వివాహం స్త్రీ స్వేచ్ఛకు పెద్ద బందిఖానా, మనసుకి ఏది నచ్చితే అది చేయచ్చు, కోరుకున్న వారితో యథేచ్ఛగా వుండవచ్చు, వద్దనుకుంటే విడిపోవచ్చు అని అంతర్లీన, బాహాట సందేశాలిచ్చే కథలు స్త్రీవాదం పేరుతో ఎక్కువగా రాకుండా నేటి స్త్రీవాద కథకులు జాగ్రత్త పడవలసివుంది.

చలంకి సమాంతరంగా సాహిత్యం సృష్టి చేస్తున్నామన్న భ్రమలో నేటి యువతీ యువకుల్ని తప్పుదారి పట్టించే కథలు కాదు మనకి కావల్సింది. ఆనాటికీ ఈనాటికీ స్త్రీల సమస్యల స్వరూప స్వభావాల్లో తేడా వచ్చిందేగాని సమస్యలు సమసిపోలేదు.

సమాజంలో ఎంత డబ్బున్నా, విద్యాధికురాలయినా స్త్రీకి పూచికపుల్ల విలువ నివ్వకుండా వ్యవస్థను నిర్వీర్యం చేస్తున్న వరకట్నం, కట్నం చావులు; బీదవారినేగాక మధ్యతరగతి కుటుంబాల్ని కూడా ఆర్థికంగా, మానసికంగా కృంగదీస్తున్న తాగుడు; బాస్‌హోదాలో వున్నా గుమాస్తా బతుకయినా తప్పని ఉద్యోగినుల సమస్యలు; పిల్లల పెంపకం, వారి భవిష్యత్తును తీర్చిదిద్దడంలో ఎదురయ్యే సమస్యలు, వ్యక్తిత్వ వికాసం, సామాజిక రక్షణ, రాజకీయ, సామాజిక వేధింపుల పట్ల నిరసన, గౌరవం గుర్తింపుల కోసం తపన, ఇంట్లో భర్త సహకారం, ప్రోత్సాహం, అండర్ స్టాండింగ్‌ల ఆవశ్యకత, శారీరక మానసిక విశ్రాంతులు, స్త్రీకి స్త్రీయే శత్రువన్న నానుడి నామరూపాల్లేకుండా చేయడం, అన్నింటినీ మించి పురుషుల సమస్యల్ని అర్థం చేసుకునే ప్రయత్నం (పురుషులు చిన్నతనంలో తల్లిమీద, పెళ్ళయ్యాక భార్యమీద, రిటైరై వృద్ధాప్యంలో ఇంటి కోడలి మీద ఆధారపడాల్సిందే కదా! వాళ్ళకి చెప్పుకోలేనన్ని కష్టాలుంటాయి) - ఇలా లెక్కకు మించినన్ని సమస్యలున్నాయి.

వీటన్నింటినీ చక్కబెట్టుకునే రీతిలో సాహిత్యం వస్తే అది స్త్రీలకేకాదు యావన్మందికీ ప్రయోజనం కలుగుతుందనడంలో ఎంత నిజం వుందో అందరికీ తెలుసు. అయితే దానికి కమిట్‌మెంట్ అవసరం.

నిజానికి ఫెమినిస్ట్ అంటే సమానత్వమూ, సామాజిక న్యాయమూ లోపించి నపుడు దానిని ధైర్యంగా చాకచక్యంతో నెలకొల్ప గలిగిన వనిత. ప్రపంచ వ్యాప్తంగా స్త్రీలకు అన్యాయం జరుగుతోందనీ అది గుర్తించి వారికి సముచిత స్థానం సమకూర్చవలసివుందని 1792 లో 'Vindication of the rights of woman' అనే తన చారిత్రాత్మక కరపత్రం ద్వారా సభ్యమానవాళిని మేల్కొల్పిన ప్రప్రథమ మహిళ మేరీ వుల్‌స్టోన్ క్రాఫ్ట్ ((Marry wollstone craft). ఈమె కూతురే ప్రఖ్యాత ఆంగ్లకవి షెల్లీ భార్య.

అలా పాశ్చాత్యుల ఆలోచనల్లో ఊపిరి పోసుకున్న ఫెమినిజం స్త్రీల సుఖ దుఃఖాలు, కష్టనష్టాలు, పురుషాధిక్య ప్రపంచంలో వారుపడే ఇబ్బందులు, ఇరకాటాల్ని కొత్త దృష్టితో ప్రజల ముందుంచి పోరాడి, స్వేచ్ఛా ప్రణయంలో మునిగి తేలి అలసిపోయింది.

స్వేచ్ఛా ప్రణయానికి పట్టంకట్టి 'ది ఫియర్ ఆఫ్ ఫ్లైయింగ్' లాంటి నవలలు రాసిన రచయిత్రి 'ఎరికా జాంగ్' హిందూ పత్రిక (6-2-1994)కి ఇంటర్వ్యూ ఇస్తూ "1960 లలో" 70 లలో సెక్స్ పరంగా స్వేచ్ఛ వుంటే స్త్రీల సమస్యలు ఎగిరిపోతాయని నమ్మాం. అందుకే మగవాడు ఆడవాళ్ళని మార్చినట్లు మేం మగవాళ్ళను మార్చాం. మా తల్లులు తండ్రులు ఊహించనయినా ఊహించలేని ప్రయోగాలను మా జీవితాల్లో చేశాం. కానీ మా మనసులకి కావల్సిందేదో మా శరీరాల్ని పంచుకున్న ఏ మగాడికీ పట్టలేదు. కాబట్టి మా స్వేచ్ఛా ప్రయోగం సమస్యకు పరిష్కారం కాదని తేలింది" అని చెప్పింది.

ఫెమినిస్ట్ ఉద్యమాన్ని తీవ్రంగా పట్టించుకుని ఉద్యమించిన జెర్మయిన్ గ్రీర్ తన 'సెక్స్ అండ్ డెస్టినీ' అనే పుస్తకంలో "పెళ్ళి అంటే పిల్లలే కదా! పిల్లలులేని కలయికకు అర్థంలేదు. ఉద్యమాలకి అతీతమైనది మాతృత్వం. అనేది వ్యక్తిచేతనను ఉన్నతపరిచే ఒక మహత్తర అనుభవం" అని రాసింది.

"చట్టపరమయిన సమానత్వానికి, సంఘపరమయిన సమానత్వానికి చాలా తేడా వుంది. గృహిణీత్వం నుండి ఉద్యోగిని అయినపుడు ఆమె బాధ్యతలు ద్విగుణీకృతమవుతాయి. పురుషద్వేషం, విశృంఖలత మనని ముందుకి తీసు కెళ్ళలేవు. పాప్‌కల్చరూ, బ్లూజీన్స్ మన ప్రగతి చిహ్నాలు కాదు. విలాస వతుల దేహసౌష్టవంతో వాణిజ్య వస్తువుల్ని విక్రయించే దుస్థితి మారాలి. గృహిణీత్వం, మాతృత్వం స్త్రీకి పుట్టుకతో సంక్రమించే వరాలు. ఆ రెండింటినీ విస్మరించడం పునాదికే హాని" అంటుంది మిచిగన్ యూనివర్శిటీ ప్రొఫెసర్ మేరియన్ టటిల్ (Marion Tuttle Marzot).

అనేక కారణాలవల్ల పాశ్చాత్యలోకంలో కుటుంబ వ్యవస్థ దెబ్బతింది. భారతీయ నాగరికత మన కుటుంబ వ్యవస్థకు పట్టం గట్టింది. ఆ బంధాలు అదృశ్య సూత్రాలు. ఫెమినిజం మంచిదే. స్త్రీలకు జరిగే అన్యాయాలను అరి కట్టాల్సిందే! కానీ "నీ స్వేచ్ఛా వాదం నాకు వరం" అని పురుషులు ఎగిరి గంతేసి అందిన అడదాన్నల్లా చెంతకు చేర్చుకునేలా వుండరాదు. ఒకప్పటి బహు భార్యాత్వంలా స్త్రీవాదం బహు భర్తృత్వాన్ని, ఒక స్త్రీ నలుగురు పురుషులు నిష్పత్తిని ప్రోత్సహించేదిగా వుండరాదు.

సమస్యలు ఎదురైనపుడు మాట్లాడుకున్నంత తేలిగ్గా పరిష్కారాలు రావు. కానీ పదునైన ఆలోచన లెపుడు పరిష్కారాలకి దూరం కావు కూడా. ఆర్థిక స్వేచ్ఛ, సమానత్వం, స్త్రీ విముక్తి పోరాటాలు, ఫెమినిజం - ఇవన్నీ కూడా ప్రస్తుత కాలానికి వుపయోగపడాల్సిన తీరు వేరు. ప్రపంచవ్యాప్తంగా అభద్రత, అరాచకం, అవినీతి వికృతరూపాలు దాల్చి భయపెడుతున్న ఈ తరుణంలో నేటి యువతరాన్ని మనం కాపాడుకోవాలి. వీధిలో కర్ఫ్యూ పెడితే ఇంట్లో తల దాచుకున్నట్లు వాళ్ళకి కుటుంబ భద్రత కావాలి. మానసిక ప్రశాంతి కావాలి.

అందుకే విదేశీయులు సయితం సాష్టాంగపడే మన భారతీయ సంస్కృతే మనకి పెన్నిధి. ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని స్వేచ్ఛా ప్రణయానికి స్వస్తి చెప్పి, విశృంఖల స్వేచ్ఛా ప్రియత్వాన్ని రెచ్చగొట్టకుండా (ఆ మేరకు సినిమాలు, 'ఇడియట్ బాక్స్' ఇతోధిక సేవ చేస్తూనే వున్నాయి) కమ్మని తెమ్మెరలాంటి కుటుంబ వ్యవస్థను పటిష్టంచేసే స్త్రీవాద కథలు రావాలి.

"హెచ్చుతగ్గులున్నచోట
చచ్చిపోవు సమభావం!
సమభావం లేనిచోట
సామ్యవాదం ఉత్తమాట!!" అన్న కాళోజీ మాటలు అక్షర సత్యాలేగా!

స్త్రీల జీవితాలు విధానపరంగా మార్పు చెందినా సంపూర్ణంగా స్వేచ్ఛా పూరితం కాలేదన్న వాస్తవంతోపాటు జీవిత పయనంలో స్త్రీ నిస్సహాయురాలిగా ఎప్పటికీ మిగిలిపోతుందా? అన్న ప్రశ్న కూడా ఉద్భవిస్తుంది. స్త్రీ పురుష సంబంధాల్లోని అడ్డుతెరలను ఆడా మగా ఇద్దరూ సమానంగా అర్థం చేసుకో గలగడమే దానికి సమాధానం.

ఒకప్పుడు స్త్రీ సమస్యల్ని పురుషులు అర్థం చేసుకొని సాహితీపరంగా ఉద్యమస్ఫూర్తితో వారిని ఉద్ధరించారు. ఈనాడు మహిళా మేధావులు ఎందరో వున్నారు. అసంఖ్యాకమైన పత్రికలున్నాయి. అవకాశాలున్నాయి. స్త్రీలో కీర్తి, సిరి, వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమ అనే ఏడు శక్తులు దాగి వున్నాయి. ఈ శక్తులను స్త్రీలు సరిగ్గా సద్వినియోగపరుచుకున్నట్లయితే తమకు తామేగాక సమాజానికి కూడా ఎంతో మేలు చేయగలరనడంలో ఎంతమాత్రం సందేహం లేదు.

ఈ వ్యాసంలో కొందరు కథకుల పేర్లు ప్రస్తావించనంతమాత్రాన వారిని మరచినట్లుకాదు.

